# పంచమి

[ రంగనాథ రామాయణాదిక వ్యాసములు ]

కృతికర్త:

## డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి

పరిష్కర్త:

## గ. శ్రీ. న. ఆచార్య

ప్రధానాంధ్రాధ్యాపకుఁడు

ప్రభుత్వకళాశాల, రాజమహేంద్రవరము



ఆంధ్ర విశ్వకళా పరిషత్తు

**1954**

వెల రు. 2/-

# ఆముఖము

కీర్తిశేషులు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి యుక్తమయ ముతో కావ్యవిమర్శ యన్నది కొంత కళావిహీనమయిన దనవచ్చును. నిరంతరము కళాపిపాసువులైన శ్రీ రెడ్డిగారు వికృతి హేమంతమున (1950 డిసెంబరులో) నన్ను మైసూరికి రప్పించి, తమ సహజసాహితీ చాతుర్యముతో సాహిత్యగోష్ఠి జరిపిన దాని ఫలిత మీగ్రంథము. ఇందు వారికి నేను లేఖక 'గుణనాథుడ' నగుట నా భాగ్యవిశేషము.

ఈగ్రంథమున నైదు భాగము లున్నవి.

## 1. కవికాలము - రంగనాథరామాయణ కర్తృత్వ విచారము

రంగనాథరామాయణకర్త గోనబుద్ధారెడ్డి యనియు, నతడు పదుమూడవ శతాబ్ది పూర్వభాగముననే గ్రంథరచన గావించెననియు సిద్ధాంతము.

## 2. ప్రాచీనములు - వికృతులు

ప్రాచీనములైన యుదాత్త విషయములు కాలదేశానుగుణము లయిన మార్పులనుబొంది 'వికార' వృత్తాంతములైనవనుట యీభాగ మున సోదాహరణముగా జర్చింపబడినది.

## 3. ద్రౌపది - సీత

శ్రీ రెడ్డిగారు ప్రధానముగా రామాయణమునుగూర్చి విమ ర్శించుచు సీతనుగూర్చి ప్రశంసింపవలసివచ్చినప్పుడు, ఈ అమ్మవారిని

ద్రౌపదితోఁ బోల్చి వా రిర్వుర శీలములందలి తారతమ్యములను బరామర్శించిరి. శ్రీ రెడ్డిగారికిఁ గవిత్రయముపైఁగల భక్తిగౌరవములు ప్రసిద్ధములు. ఆంధ్ర మహాభారతమునందలి పద్యములన్నియుఁ వారికిఁ గంఠస్థములు. ఈ కారణములచే, నీవ్యాసమున ద్రౌపది ప్రధాన స్థానమాక్రమించెను. ద్రౌపది శీలము నింత మనోహరముగా నే విమర్శకుఁడు గాని వివరించి యుండలేదనుట యత్యుక్తిగాదు.

### 4. అవాల్మీకములు - కంబఁడు, బుద్ధుఁడు

కాలాంతర దేశాంతరములవలన మూలకథ యెంతేని మాఱిపోవునని నిరూపింపఁదలఁచి, దాక్షిణాత్యములైన ఆంధ్ర ద్రావిడ బుద్ధ కంబ రామాయణములనుండి యుదాహరణముల నీ వ్యాసమున శ్రీ రెడ్డిగారు చూపియున్నారు.

### 5. భాసుఁడు

మూలకథ పెక్కుకారణములచే మార్పుపొందునని తెలుపుటకయి, వాల్మీకము లయిన యితివృత్తములను బెక్కింటిని భాసుఁడు మార్చిన వానిని దృష్టాంతములనుగా శ్రీ రెడ్డిగా రిందుఁ బేర్కొని యున్నారు.

ఈ వ్యాసపంచకమున శ్రీ రెడ్డిగారు చూపిన యుపపత్తులను బట్టియు, వీరి వాదబలము ననుసరించియు, వీరి సాహితీ వైదగ్ధ్యమును బురస్కరించుకొనియు రంగనాథరామాయణ కర్త గోనబుద్ధారెడ్డియే యని సిద్ధాంతీకరింపఁబడినట్లే భావింపవచ్చును.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తునకు శ్రీ రెడ్డిగారు కులపతులై ఆద్యంతములు దాని తీరుతీయములు, ప్రాగల్భ్యతేజములు తీర్చిదిద్దిన

కళావేత్తలు. అట్లగుట వీరి యీరచనను గూడ ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు ప్రకటింపఁ బూనుకొనుట కృతజ్ఞతకుఁ జిహ్నము. యావదాంధ్ర సాహితీలోకమునకు సంతోషజనకము.

ముద్రణోద్దేశముతో శ్రీ రెడ్డిగారే యీ గ్రంథమును బరిష్కరించి యుండినచోఁ గొన్ని భాగములను విస్తరించియు, గొన్నిటిని సంగ్రహించియు, సవరించియుందురనుట నిర్వివాదము. అట్లుగాక యెన్నఁడో వారు భాషించిన యీ గ్రంథమును యథాతథముగా ముద్రించుటచే నిందుఁ గాన్పించు అసంపూర్ణతను పాఠకులు గ్రహింతురుగాక.

నాకీ గ్రంథసంపాదనలో, గ్రంథమును బరిష్కరించి ప్రకటించుటలో, సదవకాశము నొసంగిన దివంగతులైన శ్రీ రెడ్డిగారికిని, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారికిని నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

రాజమహేంద్రవరము
7—5—1954

గ. శ్రీ. న. ఆచార్య

# విషయసూచిక



# ప్రాచీనములు - వికృతులు

ఇతిహాసములకు నితివృత్తములకును కాలదేశానుగతములయిన మార్పులు గలుగుచుండును. వ్యాసుఁడు, వాల్మీకి, హోమరు మొదలయిన మహాకవులు వ్రాసినవి జనబాహుళ్యమునందు ఆబాలగోపాలము వ్యాపించి ప్రామాణికత్వసిద్ధిని వహించును. ఇట్టివానిలోఁ బ్రదర్శింపఁబడిన గాథను వర్తమానమని చెప్పనగును. ఈ కవులు వ్రాయుటకుఁ బూర్వ మెన్నియో తరములుగా ఈ చరిత్రములు జనులలో ఊకుడు కథలుగను, పాటలుగను, సకృత్తుగాఁ బద్యములుగను ప్రసరించియుండుట నిజము. వీని పూర్వస్వరూపము కనుగొనుటకు ఆధారములు లేకపోలేదు. మఱి, మహాకవులు వ్రాసిన పిమ్మట, ఆవృత్తములు మునుపటికంటె నెక్కువగా జనులలో విస్తరించుట సంభవము. అట్లు విస్తరించుటలో నవి మరల మార్పులఁ జెందవచ్చును ; చెందును. మహాకవులచేఁ బ్రేరితములై, తదనంతర తరములయుఁ, గవులయు భావనలు నూతనకల్పనలకుఁ దొడంగుటయు సకల భాషాచరిత్రములందును విదితము. ఈ విషయమును నా కవిత్వతత్త్వవిచారమునందు సూక్ష్మముగా నివేదించి యున్నాను. ఇప్పుడీ కాలత్రయ న్యాయమును సవిస్తరముగఁ దెలుపఁగోరి, మన వీర కావ్యములనుండి దిక్ప్రదర్శనముగఁ గొన్ని దృష్టాంతములఁ జూపఁ గోరెదను. కాలత్రయన్యాయమనఁగా, భూత వర్తమాన భవిష్యత్తుల యందలి స్థితులును, తద్వికారములును. సంపూర్ణమైన వివరణకు హేతునిర్ణయమును ఆవశ్యకము. మహాకవికృతము వర్తమానము; తత్పూర్వమునందుండినయది భూతము ; తదనంతరవ్యాప్తి భవిష్యత్తు.'

ఇప్పుడు సర్వాంజనాంగీకారము వడసి వెలయు భారతేతిహాసము వ్యాసప్రోక్తమను పేరఁబరగు అష్టాదశపర్వ సంభృతమైన గ్రంథము 'సంహిత' యని విస్పష్టముగాఁ దెలుపఁబడియున్నను ఒక్కరిచేఁ గృత మైన కావ్యమని యనేకులభ్రమ.

ఉ. "భ్రాజితవృత్తిమైఁ బరగు భారత సంహిత సంయమీంద్రులా
రా, జయ నామకంబునను రాజితభంగి జగత్త్రయంబునం
బూజిత కీర్తియై నెగడు......"[1]

ఇందు భారతమును బట్టి 'జయ' యేర్పడిన ట్లున్నది. నిజము చూడఁబోయిన 'జయ' నుండి యుద్భవించినది భారతము. ప్రవహించను బ్రవహించను విస్తరించుచుఁబోవునట్టి గంగానదివోలె 'జయ' యను వీరగాథ భారతసంహితగాఁ బరిణమించినది. అనఁగా, భారతము యొక్క యంకురము 'జయ' యనుపేరఁ గథగను, బాటలుగను, మఱి చిన్న వీరకావ్యముగను, బ్రజల హృదయమును ఆవేశపూరితము గను జేసి వెలసినది. ఇది నానావిధముల, నానాకాలముల, నానా హిందూజాతులలోఁ బ్రాఁకి, క్రొత్తక్రొత్త పూవులను ఫలములను దాల్చి, నేఁటి విపులతను వహించినది. "బహుభాషల, బహు విధముల, బహుజనములవలన" నిర్మాణమునకును వచ్చిన మహాకృతి నేఁటిభారతము. పాశ్చాత్యవిమర్శకు లరణ్యపర్వములోని కొన్ని భాగములను శాంతిత్రయాది మఱికొన్ని ఘట్టములను "అనుభారత" మని భావించెదరు. మనగ్రంథములనే యాధారములుగాఁ గొని, వ్యాస చరిత్ర మిప్పుడిప్పుడే ప్రామాణిక మైనదనియుఁ, గొన్ని శతాబ్దముల క్రిందటివఱకు వ్యాసవిరుద్ధములయిన ప్రకారములు వ్యాప్తిలో నుండె

1. భారతము. స్వర్గారోహణపర్వము. ప. 89

ననియు నిరూపింపఁబోలును. భారతముతోఁ బోల్చి చూచినయెడల భాగవతము నిన్న మొన్న పుట్టినపురాణము. ఇట్టి కాలాంతరమున వ్రాయఁబడిన యీ గ్రంథమునందు భారతమునకు విరుద్ధములైన విధములఁ గొంతవఱకుఁ బాండవుల చరిత్ర వర్ణింపఁ బడియుండుట విచార్యము. ఈ సందర్భము లెట్టి యుక్తులచేతను, కుయుక్తులచేతను భారతసాంగత్యమునకు సంధింపఁబడఁ జాలనివి. చూడుఁడు.

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
|---|---|
| 1. అశ్వత్థామ, నిదురఁ బోవు ఉపపాండవులు మొదలైన వారిని సంహరించి, తొడలు విఱిగి పడి యుండిన దుర్యోధనుని జూచి యీ శుభ వర్తమానమును దెలిపి యాతని మనోవ్యథను డిందువడఁ జేసెను. | ద్రౌపదీపుత్త్రుల శిరంబుల ఖండించి తెచ్చి సమర్పించెను. (ఈ దురాచారము వీరయుగముల నుండినట్లు తోఁపదు. ఖండింపఁబడిన శిరములతోఁ, ప్రేవుల హారములను ధరించి యూరేఁగుట నవీనసంప్రదాయము.) |
| 2. అశ్వత్థామయొక్క సౌప్తిక క్రీడ జరుగునపుడు ద్రౌపది మత్స్య నగరములో నుండెను. ఆమెను బిలుచుకొని వచ్చుటకు ధర్మరాజు నకులుని బంపెను. | ద్రౌపది యుండిన స్థలము శిబిరము. స్థలాంతరమునకు బోలేదు. |
| 3. అశ్వత్థామపైఁ బగఁదీర్చుటకు ద్రౌపది భీమసేనుని నియోగించినది. (అక్కఱ గలిగినప్పు | అర్జునుఁ డేనియోగంబు లేకయే "మద్గాండీవ నిర్ముక్తభీకర బాణంబులఁ నేఁడు వాని శిరమున్ |

ఇప్పుడు సర్వజనాంగీకారము వడసి వెలయు భారతేతిహాసము
సప్రోక్తమను పేరఁబరగు అష్టాదశపర్వ సంభృతమైన గ్రంథము
హిత ' యని విస్పష్టముగాఁ దెలుపఁబడియున్నను ఒక్కరిచేఁ గృత
ర కావ్యమని యనేకులభ్రమ.

" భ్రాజితవృత్తిమైఁ బరగు భారత సంహిత సంయమీంద్రులా
రా, జయ నామకంబునను రాజితభంగి జగత్త్రయంబునం
బూజిత కీర్తియై నెగడు...... "[1]

ఇందు భారతమును బట్టి ' జయ ' యేర్పడిన ట్లున్నది. నిజము
డఁబోయిన ' జయ ' నుండి యుద్భవించినది భారతము. ప్రవహించను
హించను విస్తరించుచుఁబోవునట్టి గంగానదివోలె ' జయ ' యను
గాథ భారతసంహితగాఁ బరిణమించినది. అనఁగా, భారతము
క్క యంకురము ' జయ ' యనుపేరఁ గథగను, పాటలుగను,
చిన్న వీరకావ్యముగను, ప్రజల హృదయమును ఆవేశపూరితము
జేసి వెలసినది. ఇది నానావిధముల, నానాకాలముల, నానా
మూజాతులలోఁ బ్రాఁకి, క్రొత్తక్రొత్త పూవులను ఫలములను
, నేఁట విపులతను వహించినది. " బహుభాషల, బహు
ముల, బహుజనములవలన " నిర్మాణమునకును వచ్చిన మహాకృతి
భారతము. పాశ్చాత్యవిమర్శకు లరణ్యపర్వములోని కొన్ని
ములను శాంతిత్రయాది మఱికొన్నిఘట్టములను " అనుభారత "
భావించెదరు. మనగ్రంథములనే యాధారములుగాఁ గొని, వ్యాస
మిప్పుడిప్పుడే ప్రామాణిక మైనదనియుఁ, గొన్ని శతాబ్దముల
టివఱకు వ్యాసవిరుద్ధములయిన ప్రకారములు వ్యాప్తిలో నుండె

1. భారతము. స్వర్గారోహణపర్వము. ప. 88

ననియు నిరూపింపఁబోలును. భారతముతోఁ బోల్చి చూచినయెడల భాగవతము నిన్న మొన్న పుట్టినపురాణము. ఇట్టి కాలాంతరమున వ్రాయఁబడిన యీ గ్రంథమునందు భారతమునకు విరుద్ధములైన విధములఁ గొంతవఱకుఁ బాండవుల చరిత్ర వర్ణింపఁ బడియుండుట విచార్యము. ఈ సందర్భము లెట్టి యుక్తులచేతను, కుయుక్తులచేతను భారతసాంగత్యమునకు సంధింపఁబడఁ జాలనివి. చూడుఁడు.

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
| --- | --- |
| 1. అశ్వత్థామ, నిదురఁ బోవు ఉపపాండవులు మొదలైన వారిని సంహరించి, తొడలు విఱిగి పడి యుండిన దుర్యోధనుని జూచి యీ శుభ వర్తమానమును దెలిపి యాతని మనోవస్థతను డిందువడఁ జేసెను. | ద్రౌపదీపుత్త్రుల శిరంబుల ఖండించి తెచ్చి సమర్పించెను. (ఈ దురాచారము వీరయుగముల నుండినట్లు తోఁపదు. ఖండింపఁబడిన శిరములతోఁ, ప్రేవుల హారములను ధరించి యూరేఁగుట నవీనసంప్రదాయము.) |
| 2. అశ్వత్థామయొక్క సౌప్తిక క్రీడ జరుగునపుడు ద్రౌపది మత్స్య నగరములో నుండెను. ఆమెను బిలుచుకొని వచ్చుటకు ధర్మరాజు నకులుని బంపెను. | ద్రౌపది యుండిన స్థలము శిబిరము. స్థలాంతరమునకు బోలేదు. |
| 3. అశ్వత్థామపైఁ బగఁదీర్చుటకు ద్రౌపది భీమసేనుని నియోగించినది. (అక్కఱ గలిగినప్పు | అర్జునుఁ డేనియోగంబు లేకయే "మద్గాండీవ నిర్ముక్తభీకర బాణంబులఁ నేఁడు వాని శిరమున్ |

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
| --- | --- |
| డెల్ల ద్రౌపది భీమసేనుని దడవును, తక్కినపుడు అర్జునుని! ) | ఖండించి నేఁదెత్తుఁ, దచ్ఛిరముం ద్రొక్కి జలంబులాడు మిచటన్ శీతాంశు బింబాననా!" అని ప్రతిన సేయును. జాలి కృశించిన ఆ యమ్మను 'శీతాంశుబింబాననా' యని సంబోధించుట భాగవత శైలీవిశేషము. (ఇట్టి స్నానాలు చేయుట పరమభాగవతుల కాలపు శాంతిక్రీడ కాఁబోలు.) |
| 4. అశ్వత్థామ అపజయానంతర మరణ్యప్రవేశము చేయును తపస్సుకై. (అన్నియుఁ బోయిన పిమ్మటఁ దపము దక్క వేఱుగతి యేది?) | అర్జునుఁ డశ్వత్థామను బంధించి తెచ్చి ద్రౌపదికి నివేదించును. మంచి "బ్రాహ్మణ కానుక". అపుడు బ్రాహ్మణ భక్తి చాల ముదిరినదాట ద్రౌపది — వయస్సెక్కువయగుకొలఁది ఛాందసములు ప్రబలును గదా — "కృపికొడుకుం జూచి మ్రొక్కి" ఒక చిన్న లెక్చరిచ్చి నీతి నివృత్తిచేయును. |
| 5. పరీక్షిత్తు పుట్టినపుడే గతాయువు. కుంతి, పాండవులు నింట లేరు. కుంతి సుభద్రా ద్రౌపదులు | అశ్వత్థామయొక్క బ్రహ్మశిరోనామకాస్త్రము తన ప్రాణములఁ దీయఁగడఁగుచు నుత్తరాగర్భము |

1. భాగవతము స్కంధము ౧ ప. 148.

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
|---|---|
| శోకతప్తులై ఆక్రోశించుచుండఁగా శ్రీకృష్ణుఁడు, హస్తినలో నావఱకే యుండినవాఁడు కృపాళుఁడై వచ్చును. తల్లి యైన ఉత్తర యొక్కయు, నితరులయొక్కయు దుఃఖముచూచి తపించిన వాఁడై, తాను పూర్వమిచ్చిన మాటను దలఁచుకొని, చచ్చిన యాశిశువును దన మాహాత్మ్యముచేతఁ బ్రదికించును. ఈఘట్టముమనస్సునుదపింపఁ జేయునదే కాదు ; రంజింపఁజేయునదియు. శ్రీకృష్ణుని యొక్క సౌహార్ద్రము, పాండవ పత్నుల కతనియందుఁ గల ప్రేమ, భక్తి, విశ్వాసము, ఇవన్నియుఁ జక్కగా కన్నుల గట్టినట్లు చిత్రింపఁ బడియున్నవి. | లోని పిండము గొప్ప రోదన చేయఁ బ్రారంభించుచున్నది. "ద్రౌణ్యస్త్రవిప్లుష్టమిదం మదంగం సంతానబీజాంకుర పాండవానాం"—ఇత్యాది విధముల నప్పుడు శ్రీకృష్ణుఁడు, కరివరదుఁడు, సూక్ష్మ స్వరూపముతో, గొప్ప గదను ధరించి, ఉత్తరాగర్భమునఁ బ్రవేశించి బ్రహ్మశిరోనామకాస్త్రము తో, ఉత్తరకు నిద్రాభంగము కాకుండునట్లు, ఘోరమైన యుద్ధముచేసి, దానిని విధ్వంసముచేసి పరీక్షిత్ ప్రాణములను రక్షించును. ఈ గాథలో సౌమనస్యము లేదు. అసహ్యాకరమన్నను అసంగతము కాదు. భక్తి హెచ్చుకొలఁది సౌమనస్యము, భావనాశక్తి తగ్గును కాఁబోలు. [1] |
| 6. ఎదుటఁగల భాగవత కథ భారతమునలేదు. ( ఇందు పరస్పర వైరుధ్యము కనబడెడిని. ఇచట యాదవ వినాశము ధృతరాష్ట్రుని | విదురుఁడు తీర్థయాత్ర చని మైత్రేయునిచే నాత్మజ్ఞానంబుఁ దెలిసి, మరల హస్తినాపురికివచ్చి, ధర్మరాజును జూచి సమస్తలోక |

1. చూ. భాగవతము స్కంధము ౧-ప. 275 నుండి

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
| --- | --- |
| యాశ్రమవాస పూర్వమే యఁట! ఇంకొకచో నుత్తర మందున అని యన్నిటికంటె మించిన వైరుధ్యము) | వర్తనంబు విశదంబుగాఁ జెప్పుచు యాదవులయొక్క క్షయముచెప్పిన యెడల అతడు "ఉగ్రశోకమున బెగ్గిలి కుందెడినంచు నేమియున్ వినుమని చెప్పఁడయ్యె యదువీరుల నాశము"[1] |
| 7. గాంధారియొక్క ప్రేరణమే ధృతరాష్ట్రుని యాశ్రమవాసోన్ముఖమునకు ముఖ్యకారణము. | ముఖ్యకారణము విదురబోధ. |
| 8. ధృతరాష్ట్రుఁడు ధర్మరాజు చేతఁ, బిమ్మటఁ బురజనుల చేత ననుజ్ఞఁగొని వనవాస ప్రయాణ మారంభించును. | ఎవ్వరికిని జెప్పక సగమురాతిరిలోఁ, దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించును గాంధారీ విదురసహితుఁడై. మఱునాఁడు ధర్మరాజు "మాతల్లిదండ్రు లీ మందిరంబున లేరు; సంజయ! వారెందుఁ జనిరి నేఁడు?" అని ఆక్రోశించును. |
| 9. సంజయుఁడే గాఁడు; గాంధారీ ధృతరాష్ట్రులతోఁ, దన కొడుకులెంత బ్రతిమాలినను వినక కుంతియును వారి శుశ్రూషార్థమై యడవికిఁబోవుట కన్నులనీరుగ్రమ్మఁ జేయునట్టి ఘట్టములలో నొకటి[2] | కుంతి యింటనే యుండును. అనుగమింపద. |

1. భాగవతము. స్కం. 3.

2. చూడుఁడు, ఆశ్రమవాస పర్వము. అ ౧. 145-176

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
| --- | --- |
| 10. గాంధారీ ధృతరాష్ట్రుల దేహపరిత్యాగము దావాగ్నివలన. | ధృతరాష్ట్రుఁడు యోగాగ్నివలన శరీరమును దగ్ధము గావించి విసర్జించును. గాంధారి కంత యోగసాధన లేదు. కాఁబట్టి సామాన్యమైన యగ్గిలోఁబడి సహగమనం బొనర్చును. |
| 11. విదురుఁడు ధృతరాష్ట్రుని మరణమునకు మున్న యోగమార్గమున శరీరత్యాగముచేసి ధర్మరాజునందు లీనమగును. ( వారిరువురును యమాంశ సంభూతులవుటవలన ) | ధృతరాష్ట్రునిర్యాణము "చూపబడిన విదురుఁడు చింతాసంతాపమొదవఁ బ్రీతస్వాంతుండై తీర్థములకుఁ జనియె". విదురునికి మరణప్రాప్తియైనది ప్రభాసతీర్థమున. (సంతాపముచేతఁ బ్రీతస్వాంతులగుట మహాత్ముల లక్షణము కాఁబోలు ! ) |
| 12. యాదవ సంక్షయక్షోభప్రారంభమైనతోడనే, కృష్ణుఁడర్జునునకు సందేశమంపఁగా నప్పార్థుఁడు ద్వారవతికి వెడలును. | "హరిఁ జూడన్ నరుఁడేఁగి నాఁడు నెల లేడయ్యెం గదా !"[1] యని యేడు నెలలకుఁ బూర్వమే వెడలినట్లు భాగవతములోని వృత్తాంతము. |
| 13. కుంతియు గాంధారీ ధృతరాష్ట్రులతో దావాగ్నిచేఁ గైవల్య | యాదవవినాశము, కృష్ణవినాశము నంతయు విని "ముదమున |

1. భాగవతము - ప్కంధ-౧ ప. 333

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
| --- | --- |
| ప్రాప్తినందెను. | సంసారమార్గమునకుం బాసెన్" (తపస్సునకుఁ బోయెనో, మరణించెనో స్పష్టముగా లేదు.) |
| 14. పాండవు లేవురును ధీర స్వరూపిణి ద్రౌపదితో మహాప్రస్థాన మొనర్చిరి. | వీరందఱు కలిసి వెడలినట్లు స్పష్టముగా లేదు. మఱి వేర్వేఱుగాఁ బోయినట్లు స్ఫురించెడిని. ధర్మరాజు "చిత్తంబున బ్రహ్మము నావృత్తము గావించుకొనుచు ...ఉత్తరదిశకేఁగె నిర్మలోద్యోగమునన్"[1] అని యేకవచన ప్రయోగము. మఱియు, "అంత నాతనితమ్ము లనిలపుత్త్రాదులు... బహుళవిజ్ఞాన దావాగ్నిభసిత కర్ములైన యేకాంతులకు లక్ష్యమై వెలుంగు ముఖ్యనారాయణ స్థానమునకుఁజనిరి."[2] (భాగవతము కాఁబట్టి పాండవులు పరమభాగవతులైరి.) |
| 15. మహాప్రస్థానములో ద్రౌపది చనిపోయినది తన పతు | ముండమోసినట్లు తోఁచెడిని. "ద్రుపదరాజపుత్త్రియుఁ బతులవలన |

1 భాగవత - స్కంధ ౧ - 338

2 భాగవతస్కంధ ౧ - 387

| భారత ప్రకారము | భాగవత ప్రకారము |
| --- | --- |
| లకు పూర్వము. ఆమె మరణమే మొదటిది. తరువాత సహదేవ నకులార్జున భీమసేనుల నిర్యాణములు. | నుపేక్షితయై..."[1] సరి, యింకఁ జెప్ప నేల, భాగవతులారా! విష్ణు పదంబుచేరె. (భారతము చదివిన వాఁడెవఁడైనను, ఏకారణముచేత నైనను ద్రౌపది పతులచేత నుపేక్షితయగుట సాధ్యమని యెంచఁ గలఁడా? పతులనెల్లరఁ దన గంభీర వర్తనమునంజేసి తనకు నిత్య దాసులుగఁ జేసికొన్న లోకోత్తర చరితను విడనాడు విభులుందురే? ఇట్టి రసాభాస ప్రకారములు భాగ వత రచనాకాలమున ఆయుష్కకవి లోనో, ఆనాఁటి ప్రజల మందబుద్ధి లోనో యుండియుండుట నాహృద యమును విస్మయవిషాదములచేఁ దపింపఁజేసెడిని.)[2] |

హరివంశములోని కృష్ణజన్మాదికమునకు భాగవతములోనిదానికిఁ గల విభిన్నతలు చూడుఁడు. (భాగవతముకంటె హరివంశము చాల ప్రాచీనమైనది. కాఁబట్టి భాగవతము ప్రాచీనగాథలయొక్క వికృతి యనఁదగును.)

---

1. భాగవత - స్కంధ, ౧ - 388
2. చూ. మూఁడవ ప్రకరణము.

| హరివంశము ప్రకారము | భాగవతము ప్రకారము |
| --- | --- |
| 1. కంసునికి అతనిని వధించుటకై విష్ణువు కృష్ణుఁడై పుట్టఁబోవునది తెలుపుట నారదుని కలహావచనము. ఆకాశవాణిలేదు. ఉండినను ఆమె అవలంబించినది మౌనముద్ర. | ఇచట ఆకాశవాణి వాణి. |
| 2. దేవకి చెఱసాలలో బంధింపఁబడినట్లు లేదు. ఒకయింటనేయుండినట్లు, కంసుఁడు వారిచర్యలను బరీక్షించి తెలుపుటకై వేగుల వారిని గావలివాండ్రుగా నియమించినట్లును దెలుపఁబడియున్నది. హరివంశగాథయే సమంజసమని తోఁచెడిని. | కారాగృహమునందు ఉండి, అన్నిబిడ్డలను మృగములైన కనవఁట. ఇంక మానవు లెట్లు కనిరో ! |
| 3. వసుదేవుఁడు ప్రక్కవీథిలోనుండిన నందునింట కృష్ణునుంచును. మఱునాఁడు వ్రేపల్లెకుఁ బొమ్మనును. యమునానదిని దాఁటి కృష్ణుని దీసికొనిపోయిన వాఁడు నందుఁడు. | |
| 4. కృష్ణుఁడు కంసుని చంపు విధానము వేఱు. మేడమీఁదినుండి క్రిందికిఁ బడద్రోయుట ఇందుఁ జెప్పఁబడిన మార్గము. | |

కాలత్రయ న్యాయమురీతిని ఉత్తర రామాయణమువలెనుత్తర భారతము నొండుండవలయుఁగదా! అనఁగా భారతప్రేరితమైన యితర గ్రంథము. అట్టిద హరివంశము. విస్పష్టముగ భారతానుబంధమని దానికిఁబ్రసిద్ధి. తుదకు భాగవతభాగములు కొన్ని యుత్తరభారత మునకుఁ జేరినయంశములే. హరివంశము రచియింపఁబడిన కాలమున, హిందూజాతి, భాగవతకాలమునందువలె క్షాత్రము, పౌరుషము ఇత్యాద మానవోత్తేజక గుణంబులఁ గోల్పోయి క్షీణస్థితికి దిగి యుండలేదు. శ్రీకృష్ణుని బాల్యచేష్టలనుగుఱించి గోపికలు యశోదమ్మతో నివేదించు ఘట్టములఁ బోల్చిచూచిన, గురుత్వమునకు లఘుత్వమునకు, ఔన్నత్య మునకు నీచత్వమునకు నుండుభేదము విస్పష్టముగాకపోదు. ఇది కాల ప్రవర్తిత వికృతులఁ దెలుపుటకు ననుకూలించు ఘట్టముకావున విపుల ముగా వ్రాయుచున్నాఁడను.

**హరివంశములో గోపికలు పెట్టు మొఱలు:**

తే. గీ. గోతి నీవకా నారంబు కొడుకుఁగంటి!
వేము పడుపాటు లరయవ; యెట్టిబలియు
రైనఁ దగవు పాటింపరే! యకట కృష్ణుఁ
జిన్నవాఁడని నమ్మియు మిన్నకునికి.

కం. కుటిలవు నీవు తనూభవు
నిటుసేయఁగ విడిచి తాత్మ నించుకయును న
క్కటికంబులేదు వినుమా
యటు నీచెవులార నిట్టు లాత్మజకృతముల్.

వ. ఒకర్తె వ్రేత యన్నాతిముందఱికి వచ్చి

కం. నా యింటం బదికడవలు
నేయి పెరుగు పాలుద్రావె నేఁడివె కృష్ణుం
డోయమ్మ, కడవలన్నియు
గే యని బోరగిలఁద్రోచి కేరుచువచ్చెన్.

తే. గీ. పేదవార మింతటితోన పేదవడితి
మిట్టులైనను మాకింక నేదిబ్రదుకు!
మున్నువోయిన సేఁగికి నెన్నఁగొలఁది
లేదు నాఁగ వేఱొక గొల్లలేమ రేఁగి.

చం. అసురయోగాక సీతనయుఁ డంగన, యేఁబది బానలందుఁ బొ
ల్పెసఁగెడు వెన్న యుట్లపయి నేఁ బదిలంబుగ డించియుండ వె
క్కసముగ మ్రింగె; బానలును గ్రమ్మనఁగూలఁగఁద్రోచె నుట్లులున్
వెస నుఱుమాడె; నేమిగతి వ్రేఁగుదు! నెక్కడఁజొత్తు చెప్పుమా.

వ. అనిపలుక, నలుకతోడ గోపికయోర్తు నర్తించు విధం
బునఁ జేతులు సాఁచుచుఁ గృష్ణజననిం గదిసి యిట్లనియె.

ఉ. ఓవరిలోనఁ గొందిదేసనున్నవి మొన్నియెమొన్నఁ బెద్ద భాం
డావళి; తాళముం దలుపు నావలఁ బోఁబడ మీఁటి చొచ్చె మా
యావి భవత్సుతుండు; వెననంతన యేనును బాఱుతెంచితిన్;
త్రావెనో! యేమిసేసెనో! ఘృతం బొకబొట్టునులేదు లోపలన్.

కం. ఏ పొలములు పాడయ్యెనో
యీపల్లెను జిచ్చువెట్టి యేఁగెద మేమున్
మాపనులును గలిగిన నట
నేపగిదిని బ్రతుకరావె! యిటు పొడుకంబెన్.

సీ. అనుచుండ మఱియొక్క యతివ యాగ్రహమున
నందఱఁద్రోచు కొం చరుగుదెంచి,
ఏమని వినియెద విన్నియు! నాయింటి
సేఁగిఁ జెప్పఁగఁ జెట్ట లాఁగఁడీఁడు
నీ కొడుకే తెంచి నేఁడు నెలఁత, యెన్నఁ
బదిపంట్ల నేయును బాలుఁ బెరుగు
నొండొంటిఁ గలయంగ నుర్విపై వరదలు
, గాఁ జల్లి పనఁటులు కాలఁ గేలఁ

తే. గీ. దన్నియును వ్రేసియును వెసఁ బిన్నపెంచి
కలుగఁజేసి పాయసము కూరలును గూడు
పడుచులకుఁ బెట్టి దొంతులు పగులనడిచి
యడరి పెయ్యలనన్నింటఁ గుడువ విడిచె.

తే. గీ. పూసత్రాడు దుయ్యనులేదు పొలఁతి; మెడకుఁ
బెరుగుపా లింట నేడ్చిన బిడ్డకైన
మిడువలే దెల్లబాములఁ జెడితి మెల్లఁ
బోయితిమి ప్రాలుగల పట్టి పుట్టఁబట్టి.

వ. అనియె నట్టియెడ నోర్తు పెలుచని యెలుంగున

చం. కలయఁగఁ బాలుపిండి పులకండము వెన్నయుఁబెట్టి యట్టులై
యలవడవండితిం బతియు నాత్మజులుం బ్రియపడ్డ నాలుగే
నలుగుల దొంతిడించి యవియన్నియు నుగ్గలి నీతనూజుఁ డొ
ప్పులువడ బ్రమిఁగెఁ జోద్యమిది బూతములున్నవిగాక కద్దునన్.

కం. మగఁడింక నన్నుఁ బైఁచునె!
దిగవిడుచుం, జంపుఁగాక తెల్లము మది న
మ్మిగ పుట్టునె! యిది చెప్పిన
మొగమోటన మనుపుచుండి మూసితినబలా!

(వీర యుగములలో మగలకు నాంద్రపై చంపుసంత ఆధిక్య ముండెనా? భయాతిశయోక్తి కానోపు. హరివంశము భారతమునకు వెనుకబడిన కృతి; కాలమునందును విషయమందును.)

తే. గీ. అనఁగ వేఱొక్కగొల్లత యమ్మ! వినుము,
బానలోపల యవపిండి, పంచదార
యొదవఁగలిపి మూలను దాఁచియుండ వచ్చి
తినియె నంతయుఁ గృష్ణుండు దేవరాన.

కం. అంతటఁ బోవఁడు గూనెఁడు
సంతసమునఁ బాలుకొనియెఁ జయ్యనఁ గలకూ
డంతయును విష్ణుమాయరొ
యింతీ, యిది శిశువుచేత నిమిడెడుపనియే?

ఉ. నావుడు నోర్తు నెమ్మొగమునం గడుదైన్యము దోఁపవచ్చి నా
యావులఁ గ్రేపులం గలిపి యార్చి వెలార్చినఁ బోయె ఘోర దు
గ్ధావళిసొచ్చె నింట మగఁడాత్మజు లెవ్వరు లేరు ప్రల్లదుం
డీవిధి మమ్ము మన్నిగొనియెన్ భవదీయ సుతుండు గోపికా!

(ప్రేపల్లె ఆఁడు మళయాళము కాఁబోలు. మగవారున్నట్లు కానము. ఉండినను మూఁగలో, గ్రుడ్డివారో?)

వ. అని యివ్విధంబున నందెఱుఁ గూడి యొక్కట నచ్చేడియల మీఁద నధిక్షేపించి

కం. ఎక్కడికేనియుఁ బోయెద ;
మిక్కుట్టపుఁ బాటుపడఁగ నే పోర్వము ; నీ
చొక్కపుఁ గొడుకును నీవును
నొక్కతలయు నొక్కమూరి నుండుఁడు నెమ్మిన్.

(పురుషులట్లు స్త్రీ నాట్యమాడుభంగి చేతులు ద్రిప్పుచు నభినయము ప్రదర్శించుట భారతవైఖరికాదు.)[1]

వ. అనిన విని యశోదాదేవి వేర్వేఱ వారి ననునయించి

కం. మీసేఁగులెల్లఁ బుచ్చెద
వేసరకుఁడు ; మీరులేక వేఁగునె మాకున్ ;
చేసెం జేయఁడు బాలకుఁ
డాసురపుం బనులు నిజము లనియెదరు బలే!

కం. బొంకాడెడు గఱితలె మీ
రింకిటఁ జూచుకొనుఁ డితని నె ట్లడిచెదనో!
కింకయుఁ గలంకయును మది
శంకయుఁ బోవిడిచి చనుఁడు సదనంబులకున్.[2]

సందర్భశుద్ధి; ఔచిత్యము; సగౌరవసంభాషణ—యివి వీనిగుణములు. అప్పటికి సర్వసాధారణముగా నుండు సహజరీతు లవి. కృత్రిమకల్పనలు కావు. మఱియుఁ గృష్ణుని దుండగములు, బాలక్రీడలు దుష్టచేష్టలుగావు. వెన్న, పాలు, పెరుగు నెవరికిని దెలియకుండ సంగ్రహించుట, తల్లియావుపాలు త్రాగునట్లు దూడలను వదలుట—యివి

---

1. చూడుము భారతము - విరాట-ఆ. ౨
2. హరివంశము - పూర్వభాగము-ఆ. ౫ వ. 222-284

మనమెల్లరము పసితనమునఁ జేసిన పోకిరిపనులే. దీనిని బట్టి చూచినఁ బల్లెటూళ్లలోఁ బుట్టిపెరిగిన వారందఱు కృష్ణావతారములే. ఆయవతారము ద్వాపరాంతమునకు మాత్రము చెందినదికాదు; సర్వకాలములకును, సర్వదేశములకును.

భారతము ద్వాపరాంతమునకుఁ జెందినగాథ. రచనయందుఁ గొన్నికథాభాగములు క్రీస్తుశకమునకుఁ బూర్వములు. భాగవత రచన బహుశః వేయినేనూఱేండ్ల తరువాతిది. ఈ కాలక్షేపమువలన భారతీయులలో శీలమెంతయో కృశించి కీడ్పడినట్లున్నది. వర్ణనావిధానములఁ బరిశీలించితిమేని వీరయుగమునాఁటి గణనాతీతమైన ఔత్కృష్ట్యమును గాంభీర్యమును, బరమభాగవతులనాఁటి పతితత్వమును నికృష్టతయును, గోచరింపకపోవు. చూడుఁడు, భాగవతసరణి కృష్ణక్రీడలు :

కం. బాలురకుఁ బాలులేవని
బాలెంతలు మొఱలువెట్టఁ బకపకనగి నీ
బాలుం డాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ.

కం. పడఁతీ, నీబిడ్డఁడు మా
కడవలలోనున్న మంచి కాఁగినపా లా
పడుచులకుఁ బోసి చిక్కన
కడవలఁ బోనడిచె నాజ్ఞకలదో లేదో!

కం. మీపాపఁడు మా గృహముల
నాపోవఁగఁ బాలుఁద్రావ నగపడకున్నన్
గోపించి పిన్నపడుచుల
వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ.

మ. కో. పుట్టిపుట్టఁడు నేఁడు దొంగిలఁబోయి మాయిలుసొచ్చి తా
నుట్టియందక ఱోళ్ళుఁబీఁటలు నొక్కఁబ్రోవిడి యెక్కి చే
వెట్టఁజాలక కుండక్రిం దొక పెద్దతూఁటొనరించి మీ
పట్టి మీఁగడపాలుఁ జేరలఁబట్టి త్రావెఁ దలోదరీ.

కం. ఆడంజని వీరల పెరు
గోడక నీసుతుఁడు ద్రావి, యొకయించుకఁ దాఁ
గోడలి మూతిం జమిరినఁ
గోడలు మ్రుచ్చనుచు నత్త గొట్టె లతాంగీ.

కం. వారిల్లుసొచ్చి కడవలఁ
దోరంబగు నేయిఁద్రావి తుది నా కడవల్
వీరింట నీ సుతుం డిడ
వారికి వీరికిని బెద్దవాదయ్యె సతీ.

కం. వేలుపులఁటె నా కంటెను
వేలుపు మఱి యెవ్వఁడనుచు వికవికనగి మా
వేలుపుల గోడపై నో
హేలావతి నీ తనూజు డెంగిలిచ్చేసెన్.

(కృష్ణుని దేవత్వపుంగాలి యప్పుడే వీచెడిని)

కం. వెన్నదినఁగఁ బొడగని మా
పిన్నది యడ్డంబువచ్చి పిఱిఁదికిఁ దివియన్
జన్నొడిసిపట్టి చీరెను
జిన్నికుమారుండె యతఁడు శీతాంశుముఖీ!.

కం. ఇమ్మగువ తన్నువాఁకిటఁ
గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పేరడుగం
గెమ్మోవి గఱచి పడిఁ జనె
నమ్మా! యీ ముద్దుఁగుఱ్ఱఁ డల్వుఁడె చెపుమా!

( అంతపని చేసినదానికిఁ గోపముతో "ముద్దుఁగుఱ్ఱఁ" డనుట యెంతౌచిత్యము! )

కం. చేబంతి తప్పిపడెనని
ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మా బిడ్డ జలకమాడఁగ
నీబిడ్డఁడు వలువదెచ్చె నెలఁతుక, తగునే!

( సచేల స్నానము పూర్వ మెక్కువ వాడుక. ఎందుకనఁగా గదులలోఁగాక గాలిలో స్నానముచేయుటకతన. ఈ విచేల స్నానము ఆయమ్మ కృష్ణుని కొఱకుఁ జేసెనేమో! కృష్ణుని ప్రత్యుపకార మీ దుండగము! )

కం. ఇచ్చెలువఁ జూచి ముచ్చిలి
యచ్చుగ నఱికించుకొనుచు నరిగెద నాతో
వచ్చెదవా యని యన్నాఁ
డిచ్చిఱుతఁడు సుదతి, చిత్ర మిట్టిది గలదే!

కం. కొడుకులు లేరని యొకసతి
కడు వగవఁగ, దన్నుమగనిగాఁ గైకొనినం
గొడుకులు గలిగెదరని పైఁ
బడినాఁ డిదివినుము శిశువువనులే తల్లీ,

( కట్టిగ వీథిలో నఱచినదా? కృష్ణుని మఱుఁగుగాఁ బిలిచి చెప్పినదా? )

కం. తలఁగినదానం దలమనఁ
దలఁగక యాచెలికి నాన తలయెత్తఁగ నీ
తలఁగిన చోటెయ్యది యని
తలయూఁచెన్ నీసుతుండు తగవె మృగాక్షీ.

కం. ప్రాలఁగవచ్చిన నీసతి
చూలాలం దలఁగుమనుడుఁ జాలగుటకు నే
మూలంబు చెప్పుమనె నీ
బాలుఁడు, సెప్పుదురె సతులు పర్వేందుముఖీ?

కం. మగువా, నీకొమరుఁడు మా
మగవా రటు పోవఁజూచి మంతనమునకుం
దగఁజేరి పొందనడిగెను
జగముల మున్నిట్టి శిశువు చదువంబడెనే?

ఆ. వె. నమ్మి నిదురవోవ నాపట్టిచుంచు మా
లేఁగతోఁకతోడ లీలఁగట్టి
వీథులందుఁ దోలె వెలఁది నీకొమరుండు
రాచబిడ్డఁడైన అవ్వమేలె!

కం. నాపట్టి పొట్టనిండఁగఁ
బైపడ నీపట్టి వెన్నబానెం డిడినాఁ
డూపిరి వెడలదు వానిం
జూపెద నేమైన నీవచుమ్ము లతాంగీ.

కం. తెఱవయొకతె నిద్రింపఁగ
నెఱిగట్టిన వలువయీడ్చి నీటగు తేలుం
గఱపించి నీకుమారుఁడు
వెఱచుచు నదిపఱవ నగియె విహితమె సాధ్వీ !

( తేళ్ళలో రెండురకాలా ? నీటయినవి కానివి అని ? )

కం. నాకొడుకును నాకోడలు
నేకతమునఁ బెనఁగఁ బాము నీతడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ
గూకలిడెన్ నీసుతుండు గుణమె గుణాఢ్యా.

( బహిరంగ క్రీడయా ? )

కం. తరుణియొకతె పెరుగుఁ ద్రచ్చుచోఁ దుదివంగి
వెన్న దీయనొదిగి వెనుకఁ గదిసి
మగువ నీసుతుండు మగపోడుములు సేయ
సాగినాఁడు తగదె చక్కఁజేయ ?

సీ. కలకంఠి మావాడ గఱితలమెల్ల నీ
పట్టిరాఁగలఁడని పాలుపెరుగు
లిండ్లలోపలనిడి యేమెల్లఁ దనత్రోవఁ
జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ
తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి
యున్నచందంబున నున్నవరయ
నొకయింటిలోసాడు, నొకయింటిలోఁ బాడు
నొకయింటిలో నవ్వు నొకటఁ దిట్టు

ఆ. వె. నోకటవెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములఁ బరగఁజేయు
నిట్లుచేసి వెనుక నెక్కడనో పోవు
కానరాఁడు రిత్తకడవ లుండు.

కం. కడు లచ్చి కలిగెనేనిం
గుడుతురు కట్టుదురుగాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ.

కం. ఓ యమ్మ మీ కుమారుఁడు
మా యిండ్లను బాలుపెరుగు మననీఁడమ్మా!
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ.

(తుదకు నీ యమ్మలక్కలకు పాలుపెరుగుపై నుండు నభిమానము కూఁతుండ్రయందు, కోడండ్రయందుఁ సౌశీల్యమునందు లేదామోఁగా! అప్సరోఽంశసంభూతలు కాఁబట్టి, పాతివ్రత్యమునకంటె పాలే ముఖ్యమేమో!) విషయము లసద్భావములు; మాట లసభ్యములు. స్త్రీలు బహిరంగముగా నిట్లు గుంపులుకూడి అందఱు వినునట్లు, అందఱకుఁ దెలియునట్లు పరమభాగవత లోకమునఁ దప్ప నింకెక్కడనైనఁ బలికియుందురా! పలుకుట గలుగనేర్చునా? కృష్ణుఁడు సర్వశక్తిసమేతుఁడైన భగవంతుని పూర్ణావతారమగుట ఈ కార్యములకు ఆ చిన్నవయస్సుననే సమర్థుఁడై యుండఁగానోపు. ఇవి భక్తిరసమును

1. భాగవతము - దశమస్కంధము-పూ. భా. ప. 30 - 340.

బెంచుటకై చెప్పఁబడిన వృత్తాంతములు. కాల మెట్లుమాఱినది, ఎంత మాఱినది హరివంశమునాళ్ళనుండి భాగవతమునాళ్ళు వచ్చులోన!

భాగవతముప్రకారము యశోదాదేవి గోపికల కిచ్చు సమాధాన రచన:

కం. చన్నువిడిచి చనఁ డిట్టటు
లెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ లెఱుఁగడు నేఁడుం
గన్నులు తెఱవని మా యీ
చిన్నికుమారకుని అవ్వ సేయం దగునే.

తే. గీ. అన్య మెఱుఁగఁడు తనయంత నాడుచుండు
మంచివాఁ డీతఁ డెగ్గులు మానరమ్మ
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీమతల్లులార!

అని యశోద వారలనోడంబఱచి పంపి కొడుకుం గోపింపంజాలక యూరకుండె" [1]

ఈ ప్రత్యుత్తరముల తారతమ్య మేమనఁగా, హరివంశములోఁ దనకొడుకు దుడుకుఁదనము నేసియుండవచ్చుననియు, గోపికవార్తలలో వాస్తవముండుననియు నికముందు తనకుమారుని క్రమచర్యలలోనుండునట్లు చేయుదుననియుఁ జెప్పి గోపికలకు యశోద మనస్సమాధానమొనర్చెను. భాగవతమందలి యశోద యొకగంటసేపు చవులూరించు గోపికల వివరములు విని, "మీరు దబ్బఱకాంతలు; నాకొడుకు చాల

---

1. భాగవతము. దశమస్కంధ. పూ. భా.

మంచివాఁడు; అల్లెన్నడును జేయఁడు; ఇఁక వెడలుఁ" డని మంద
లించి వారల నొడఁబఱచినదఁట. ఇది యెట్టియొడంబడికయో!

భారతౌన్నత్యమునకు, భాగవతపతితత్వమునకుగల వ్యత్యాసము చూపుటకై మఱియొకదృష్టాంతము. భారతమున యాదవ వినాశానంతరము అర్జునుఁడు ద్వారవతినుండి మరలి వచ్చుచు వ్యాసుని సందర్శింప నతఁడు

సీ. "తద్వదనమ్ము కనుగొని నిన్నెఱుఁగంగరాదు

గీ. వెడమొగంబైన దిది యేను విజయ యెట్ల
కేల కెఱఁగితి, నిదియేమి, కినుకవాఁడమి
వధమునకు నయోగ్యుండగు వానిఁజంపి
తే, పరాజితుఁడై తె, నీ తెఱఁగు చెపుమ."[1]

అని యడిగెను. ఆవల ధర్మజునొద్ద కేఁగినపు డతఁ డర్జును నేమియుఁ బ్రశ్నింపక, "అర్జునుం డమ్మెయి నచ్యుతరామాది యాదవజనుల వృత్తాంతములును దనదు తెఱంగు"...జెప్పిన విని "ప్రస్థానంబునకు మదివొలయ నన్నరునితోడ

సీ. అఖిలభూతంబుల ననఘుపాకంబు బొం
దించు గాలుండు మదీయబుద్ధి

తే. గీ. కర్మసంత్యాగ కలనంబు కార్య మిప్పు
డను వినిశ్చయ మొందె నీమనము నరయ
నిదియ మేలుగఁ గనుచున్కి విదితమయ్యె"[2]

నని నుడువును.

---

1. భారతము - మౌసలపర్వము—వ. 207
2. భారతము - మహాప్రస్థానికపర్వము—వ. 4

భాగవతప్రకారము అర్జునుఁడు ద్వారకనుండి, కన్నీరుగార్చుకొని ధర్మజుని జూడఁగా, నతఁడు "నీ విట్లు ఖిన్నుఁడవై యుండుటకుఁ గారణ మేమి?

కం. ఓడితివో శత్రువులకు
నాడితివో సాధుదూషణాలాపములన్
గూడితివో పరసతులను
వీడితివో మానధనము వీరులనడుమన్.

కం. తప్పితివో యిచ్చెదనని
చెప్పితివో కపటసాక్షి చేసినమేలున్
దప్పితివో శరణార్థుల
రొప్పితివో ద్విజుల పసుల రోగుల సతులన్.

కం. అడిచితివో భూసురులను
గుడిచితివో బాలవృద్ధ గురువులు వెలిగా
విడిచితివో యాశ్రితులను
ముడిచితివో పరులవిత్తములు లోభమునన్"[1]

అని ప్రశ్నించుచున్నాఁడు. శబ్దాలంకారములేని యర్థమే మయినఁ గలదా? ఆవేళ కర్జునుఁడు ముదుసలి. అన్ని సారములు, సత్త్వములు నుడిగినవాఁడు. వానియెడ నిట్టి ప్రశ్నలు ప్రయోగించుటచే భాగవతకాలమునాఁటికి మనదేశీయుల భావశీలములు ఎంత తక్కువస్థితికి వచ్చినవో యెఱుఁగనగును. భక్తి ముదిరిన దేమోగాని శక్తియు మేధాశక్తియుఁ దగ్గినవి.

---

1. భాగవతము - స్కంధము-౧. ప. [illegible]

3

# ద్రౌపది - సీత

ద్రౌపదియెడఁ బాండవులు చూపిన గౌరవాదరములు

ద్రౌపది తన్నుగుఱించి చెప్పుకొన్న ప్రకారము

కుంతికి ద్రౌపదియందుండెడి ప్రేమ గౌరవములు

సీతా ద్రౌపదులు

# ద్రౌపదియెడఁ బాండవులు చూపిన గౌరవాదరములు

పూర్వప్రకరణమున నొక్కచో[1] "భారతము చదివినవాఁడెవ్వఁడైన, నేకారణము చేతనైనను ద్రౌపది పతులచే నుపేక్షితయగుట సాధ్యమని యెంచఁగలఁడా ?" యని వ్రాసియున్నాను. భారతమున ద్రౌపది యెట్టి యుత్తమస్థాన మాక్రమించి యుండెనో యీప్రకరణమున దిక్ప్రదర్శనముగాఁ దెలుపుదును.

ఆరణ్యపర్వమునందలి ద్రౌపదీధర్మరాజుల సంవాదము వలనఁ ద్రౌపది యెంతయో విజ్ఞానవతియనియు, వివేకవంతురాలనియు, రాజనీతియందుఁ బ్రగల్భయనియుఁ దెల్లమగును. 'సరిసమానురాలు' గా నామె తనతో వాదప్రతివాదములు సలిపినందుకు భర్త కినియలేదు; విసుగు చెందనులేదు.

ఆరణ్యపర్వములోఁ బాండవులు గంధమాదనపర్వతమునకుఁ బోవునపుడు గొప్ప గాలివాన తటస్థించినది. అపుడు "అతి విషమశిలా సంకటపథంబున నడవనేరక ద్రౌపది తొడరిపడి మూర్ఛితయైనఁ, బవన తనయుఁ డక్కోమలి నెత్తికొని యజినాస్తరణంబుపైఁ బెట్టి, కదళీదళంబుల వీచుచున్నఁ, గవలు దాని పల్లవతామ్రపాదతలంబు లాయుధాభ్యాసవశంబునఁ గిణీభూతంబులైన తమ కరతలంబులంజేసి మెత్తన యొత్తుచుండిరి."[3] (భర్తలయొక్క పని ఆమెను మోచుట; కాళ్లు

1. రెండవ ప్రకరణము పుట 35
2. చూ, భారతము - అరణ్య-అ. ౧ ప. 208-288
3. భారత - అరణ్య-అ. ౩ ప. 298

పట్టుటయు.) అంత, ధర్మజునియోగంబున భీముఁడు "...వీరాగ్రణి ఘటోత్కచుం దన, యగ్రసుతుం దలఁచె ధీరు హైడింబేయున్"[1] ఆతఁడు రాక్షసబలముతోఁ బ్రత్యక్షముకాఁగా, భీముఁడు :

తే. గీ. "అబల యిది భవన్మాత, నిత్యాధ్వగమన
ఖిన్నయైనది గజరాజ ఖేలగమన ;
దీని నీవెత్తికొని చనుదెమ్ము మా స
మీపమున నని సుతు నియమించె నపుడు."[2]

చ. "అలఘులు గంధమాదన మహాధరణీధర సానురత్న వే
దులఁ బవమాననందనుఁడు ద్రోవదియున్ విహరించుచున్నచో
లలిత సహస్రపత్రకమలంబు సమీరవిధూతమై మహీ
తలముపయిన్ వడిం బడియెఁ దద్దయు బొల్పుగ వారిముందటన్.

వ. "ఆ సౌగంధిక కమలంబుఁజూచి దాని యపూర్వరమణీయత్వంబునకు ననన్య కుసుమ సాధారణంబైన సౌరభ్యంబునకు నోటువడి ద్రుపదరాజపుత్త్రి ముదితచిత్తయై, 'యక్కటా, యిదియొక్క పువ్వయయ్యు, నపూర్వంబై మనోనయనానందకరంబైనది. ఇట్టి కుసుమంబులు కడుంబెక్కులు కావలవదే! యవి కుఱంగటం గలవేని దెచ్చియిచ్చి నాకు మనఃప్రియంబు సేయుము"[3] అని భీము నర్థించినది. ఇందలి విశేషము : ద్రౌపది ధర్మరాజు నడుగకయు భీమసేను నా పువ్వులు తేవలయునని నియోగించుట. ఇందు అమ్మగారి ప్రభుత్వమే గాని అయ్యగారి రాచఱికము నహి ! భీముండును " దాని యభిమతంబు సేయఁ గడంగి" ఆయుధంబులు ధరియించి సౌగంధికాహరణార్థము

---

1. భారతము - అరణ్య-అ ౩ ప. 303
2 అందే-ప 308
3 భారతము - అరణ్య-అ ౩ ప. 310. ప. 311

వెడలును. ద్రౌపదియొక్క యభిమతము దీర్చుట యీతనికిఁ బ్రధానముగాని యన్నగారి యాజ్ఞవడయుటకాదు.

భీముఁడు లేమి కనుంగొని యవశకునములకు జంకి, ధర్మరాజు వానిని రోయుటకై పోవసమకట్టి, తన సమీపంబున నున్న పాంచాలిం గనుంగొని,

కం. "ప్రియసాహసుండు భీముఁడు
భయవిరహితుఁ డెందుఁబోయె ? భయరాక్షస సం
శ్రయ మిగ్గిరి, గంధర్వా
న్వయ సేవ్యం, బేకచరుఁడు వాఁ డెయ్యెడలన్"

ఆ. వె. "భూరిభుజుఁడు తానెపోయెనో, నీవేట
యేని పుచ్చితో నిజేచ్ఛ నతని"[1]

అని ప్రశ్నించును. ఇందలివిశేషము: భార్య తనతోఁ జెప్పక యే తమ్ముని బనిమీఁదఁ బంపిన ట్లూగ్గడించుట. అతిక్రమవర్తనమని గాని, ఆక్షేపణీయమని గాని సూచించుట గానము. ద్రౌపదికిఁ దన పురుషులను స్వతంత్రించి యాజ్ఞాపించునంతటి యధికార గౌరవము లుండెననుట స్పష్టము. అపుడు ద్రౌపది

మధ్యాక్కర "ధరణీశ, నీకు నాయిచ్చిన పసిఁడి తామరపువ్వు
గురువాయువశమున వచ్చినను దానిఁగొని యిట్టిపువ్వు
లరుదుగాన కుజంగటం గలిగెనేని నర్థిఁ దెమ్మనిన
నరిగె నీశానదిక్కునకు నీయనుజుఁ డనిలవేగమున"[2]

అని ధీరముగా ప్రత్యుత్తర మొసఁగినది. అపూర్వమును, క్రమాతీతము నయిన వర్తన నడపినట్లు సంకోచింపక, ధీరముగాఁ, బతుల

1. భారతము - అరణ్య-అ ౬ ప. 371, 372
2. అ. దే-ప. 373

నాజ్ఞాపించు స్వాతంత్ర్యము గలిగినయట్లు వచించుట సర్వసాధారణ చర్యగా భావింపఁబడుట యిందలి విశేషము.

పోనీ ఒకపరి యిట్లుచేసెఁగదా! అంతటితోనైన ద్రౌపది విరమించునా? ఆమె పునశ్చరణచేయనట్టి చప్పిఁడి స్త్రీకాదు. పిమ్మటఁ గొన్నిరోజులకుఁ బాండవులు మాల్యవంతమునకుఁబోయి యచ్చట విశ్రమించి విహరించుచు, "ఒక్కనాఁడు శ్వేతకి యను పుణ్యానదివలన మారుతానీతంబులై తమ ముందటం బడిన పంచవర్ణసురభికుసుమంబులం జూచి యందఱు విస్మయంబందిరి. అంత నేకాంతంబ యొక్క శశికాంత శిలాతలంబుపయినున్న భీమసేనునకు ద్రుపదరాజ పుత్త్రి యిట్లనియె :

కం. "ప్రకటముగఁ దొంటి సౌగం
ధిక కనకాబ్జములకంటె దివ్యసుగంధా
ధిక కుసుమము లివి తద్దయు
సుకుమారము లిట్టివానిఁ జూచి యెఱుంగన్."

"ఇక్కుసుమంబులు నాకుఁ దెచ్చియిచ్చి మనఃప్రియంబు సేయు మనిన భీముండు తత్క్షణంబ"[1] చనె పుష్పయాత్రకై. ఇందలి విశేషమిది: అందఱు విస్మయం బందిరి, కాని యెవ్వరు నేనియోగమునకుఁ బూనలేదు. ద్రౌపది "నాకుఁ దెచ్చియిచ్చి మనఃప్రియంబు సేయు" మని భీమసేనుని గోరఁగా నతఁ డాపెయొక్క మనోఽభీష్టమును నెఱవేర్చుటయ పరమార్థంబని, అన్నగారు పూర్వము తన్ను

1. భారతము - అరణ్య-౪ ఆ. 8

ఆ. వె. "చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ
నల్లవారికంటె నెఱుక గలవు;
గురుభుజుండ నాకుఁ గూర్తినిఁ జేయకు
మయ్య యిట్టి చెయ్వులనఘ యింక"[1]

అని నిరోధించియున్నను, ఆమాటలను ద్రౌపదీదేవియొక్క మహామాయాప్రభావంబున మఱచి తత్క్షణము పుష్పాపహరణార్థము కడంగుట.

ద్రౌపదియొక్క మాహాత్మ్యము పాండవవిజయ కారణంబని జను లనుకొను భావమున కాధారములైన భాగములు, ఇప్పుడిపుడు ప్రామాణికమని ప్రబలియుండు భారతమునం దచ్చటచ్చటఁ గొన్ని కలవు. సావిత్రియొక్క లోకోత్తర చరిత్రమును మార్కండేయుఁడు చెప్పి

తే. గీ. "ఆ పతివ్రత యట్ల యీ యాజ్ఞసేని
పరమకల్యాణి ధర్మసంభావనీయ
యధిప మిమ్మును మీయఖిలాన్వయంబు
నుద్ధరించు మహాభాగ్య యుక్తిఁ జేసి"[2]

అని పాండవులకు ద్రౌపది నొప్పగించి వీడ్కొనుచున్నాఁడు.

సౌప్తికపర్వమున నశ్వత్థామ నోడించి, భీమార్జునులు ద్రౌపది నాశ్వాసించుటకై వచ్చు సందర్భములోఁ జేయఁబడిన వర్ణనయిది. "అట్లు గాంచి యకాకాంతచుట్టు నాసీనులైరి. అప్పు డగ్రజుండు వనుపఁ బవనతనయుం డమ్మణి యద్దేవికి నమర్పించి "నీ తాల్మిగదా

1. భారతము - అరణ్య-ఆ. ౨ ప. 377
2. భారతము - అరణ్య-ఆ. ౭ ప. 379

భూపాలు నమ్మలికముం బాచున్"[1] అని ఆపెయొక్క ధీరత్వము పాండవుల మనస్స్థైర్యమునకు హేతువని తెలిపి "మా యూఱటకు నీయూఱట ప్రధానము కావున మాకొఱకునైన నీవూఱట చెంద వలయు"నను ధ్వనితో సంబోధించెను.

దుర్యోధనుని తొడలు గూల్చి, వానిని బెక్కు ప్రల్లదంబులాడి, "పెలుచనవ్వి, ధర్మనందన గోవింద పాంచాలప్రకరపార్థ సాత్యకి నకుల సహదేవుల నాలోకించి,

ఆ. వె. శంకలేక కడఁగి సభ కట్లు పాంచాలి
నంటరాని దాని నొంటిచీర
తోన యున్నసాధ్వి వేనలివట్టి యీ
డ్చించి నతనిఁ జూడుఁ డంచుఁ బొదలి.

పాంచాలిచేసిన తపంబుపెంపున నీశోభనంబు నమకూఱె"[2] నని కృష్ణుని సాహాయ్యమునకంటె కృష్ణాసాహాయ్యమే ముఖ్యమని భీముఁడు అందఱ యెదుటను బ్రకటించినట్లు చెప్పుట ఆపెయందు వీరి కెంత నమ్మికయుఁ, గృతజ్ఞతయు నుండెనో విశదపఱచెడిని.

విరాటపర్వములో, పాపము, ద్రౌపది పతిశ్రమంబునూని తన పురుషులతోఁ జెప్పుచున్నది.

ఉ. "దప్పిజనించె వ్రేళులపుటంబులు పొక్కఁదొడంగె; గోళ్ళలోఁ
జిప్పిలఁజొచ్చె నెత్తురులు; చిత్తము నాకుఁ గడున్ వశంబుగా;

1. భారతము - సౌప్తిక-ఆ. ౨ వ. 88. 89
2. భారతము - శల్య-ఆ. ౨ వ. 282, 283, 284

దప్పురమిచ్చటచ్చటను నాసలవచ్చితి నెంతదవ్వొకో!
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్ ''

అనవుడు

కం. తనమది కరుణయు ఖేదం
బును బిరిగొనుచుండ ధర్మపుత్రుఁడు నకులుం
గనుఁగొని ద్రుపద నృపతినం
దన దేస యాతనికిఁ జూపి తగ నిట్లనియెన్

ఆ. వె. అకట మనము వచ్చినది కడుదవ్వు, నేఁ
డప్పురంబు సొత్తమని తలంచి
తఱిమి నడచితిమి; లతాతన్వి, యిదివడ
గొనియె మోచి తెమ్ము కొంతదవ్వు. ''[1]

పిమ్మట నకులుఁడు డస్సినపుడు సహదేవుఁడు కొంతవఱకును, అతనికిఁ బిమ్మట నర్జునుడును, ఆతరువాత భీముఁడును ఆపెనుమోచికొని పురము సమీపమున విడియుదురు. (పురుషులు తనకు దాసులుగదా!)

మాఱువేషముతో వీర లెట్టు లెట్టులు మెలంగవలయునో యావిధముల నిశ్చయించుకొనునప్పుడు ధర్మరాజు ద్రౌపదిని జూచి, " నీవు చక్కనిదానవు

కం. మన వంశంబున వృత్తం
బును శెంపును గావఁజాలు పుణ్యవతివి; దు

1. రతము - విరాటపర్వము- ౧. ౧ ప 147-150

ర్జనులగు తులువల తలఁపులు
కనుగొని యేమఱక మెలఁగఁగా వలయుఁ జుమీ" [1]

అని బుద్ధులు చెప్పునపుడు "నీవెవఁడవు నాకు బుద్ధిచెప్పువాఁడవు" అను ధోరణిగా "యాజ్ఞసేని యనాదరమందస్మిత సుందర వదనారవిందయై" [2] నాశీలమును నేను రక్షించుకొనఁగల నను ధీరభావముతోఁ బ్రత్యుత్తర మిచ్చినది.

కీచకుండు, తనయిల్లాలిని బరిభవింపఁజూచియు

ఉ. "అప్పుడు ధర్మసూతి హృదయంబు కలంగ, లలాటభాగముం
గప్పగ ఘర్మవారి, యధికంబగు రోషమునొంది యుండియుం
దప్పఁగఁ ద్రోచికొంచుఁ దనధైర్యము పెంపున నిర్వికారుఁడై
యెప్పుడు దాను బల్కు నెలుఁగేర్పడ ......" [3]

నుండి ద్రౌపదిని

తే. గీ. "... నాథుల దూఱంగఁగాదు వినుము
సతికిఁ దానెంత వడియును సభలలోనఁ
దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి
శంకసెడి ధిక్కరింపగఁ జనునె! చెపుమ."

అని మందలించియు "ఇట్లు చెప్పిన ధర్మతనయుని పలుకులు విని వెండియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి యెద్ది యేనియుం బలుకం దలంచినం, జూచి యతండు మఱియు నిట్లనియె.

1. భారతము - విరాటపర్వము—అ. ౧ వ. 109.
2. అందే-వ. 110
3. భారతము - విరాటపర్వము- అ. ౨ వ. 147

కం. "పలుపోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువచందము
తొలఁగఁగ నిట్లునికి తగవె తోయజవదనా!"

అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నిట్లనియె.

ఆ. వె. "నాదువల్లభుండు నటుఁ డింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారు
గానఁ బతుల విధమకాక యే శైలూషి
గాదనంగరాదు కంకభట్ట!

అట్లగుటం జేసి నాట్యంబును బరిచితంబ. మత్పతి శైలూషుండ కాఁడు. కితవుండును గావున జూదరి యాలికి గఱువతనం బెక్కడిది యనుచు నచ్చోటువాసె." [1]

ఇందలి నర్మము లీయవి. "ఒకపురుషుఁడు విరాటమందిరములో నాట్యాచార్యుఁడు; ఇంకొక పురుషుఁడు కితవుఁడు; మీ కేమి హక్కుగలదు నన్నిమాటలాడుటకు?" అని ధ్వనించునట్లు ప్రతిఘటనా ప్రతివచనములతో నుగ్రస్వరూపిణియై యచ్చోటువాసి చనియె. ఇట్లు ధిక్కరించెనే యని పతు లామెయెడ కించిన్మాత్రమైనఁ దప్పుపట్టిరా? విసుగుచెందిరా? కోపగించుకొనిరా?

భీమసేనునితోఁ దన భంగపాటు చెప్పి పరితపించు సందర్భమున, ద్రౌపది తన కష్టనిష్ఠురములను దెలిపి, దుఃఖించి

1. భారతము - విరాటపర్వము-అ ౨ ప. 148 (ఎత్తుగీతినుండి)-190

తే. గీ. "వానిఁ దెగఁ జూడ వైతేని వాయుపుత్త్ర
నీవు గనుగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబుననైన నేను
మేను దొఱఁగుదు నెట్టు నీ యానసుమ్ము."[1]

అని తీవ్రప్రతిజ్ఞతోఁ గీచకవధ విధించినపుడు భీమసేనుఁడు

తే. గీ. "ఎల్లి యెల్లవిధంబుల నెందుఁ జొచ్చె
నేని నాధర్మతనయుండు తానవచ్చి
యడ్డపడెనేని, నీవ పెంపారుకరుణఁ
గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు."[2]

అని ప్రతిన సేయుచు, ద్రౌపది కరుణామూర్తి కావున నొకవేళ ఆకీచకునకే అడ్డము రావచ్చునని చెప్పుట తలచుకొన్నచో నాపె యందు వారికెట్టి గౌరవభావములు గలవో తోఁచునుగదా!

ఉపకీచకవధానంతరము భీమసేనుఁడు "నిగూఢవచనచాతుర్య ధుర్యుఁడై" ద్రౌపది నుద్దేశించి

"..................................భవత్
పతులిటు లాచరించుటఁగదా భవదీయ మనోనువర్తన
స్థితి కుచితంబు, వారల నుతింపఁగనేల నిసర్గవృత్తులన్"[3]

అని యనుటలో నాపెయొక్క మనోనువర్తనము వారికి సహజ వృత్తియని యేర్పడుచున్నది.

1. భారతము - విరాట—ఆ. ౨ ప. 280
2. అందే—ప. 282
3. భారతము - విరాట—ఆ. ౫ ప. 41, 42

శాంతిపర్వమునందు "బహుబంధుమరణశోకప్రహతాత్ముండై" ధర్మరాజు వనవాసము వెడలవలయునని యుద్దేశించి మాట్లాడఁగాఁ, దమ్ములందఱు 'నిటు సేయుట తగదు; రాజ్యము సేయుటయ ధర్మము' అని బోధించు పలుకులు విని ధర్మనందనుం డూరకయుండె. "ఆతనియెడ సవిశేషబహుమానయు, నతనిచేత సంతతోపలాలితయు, ధర్మాధర్మ నిదర్శనశీలయునగు పాంచాలి, భద్రగజప్రతిమానులైన యప్పవమాన తనయ ధనంజయ నకుల సహదేవ మధ్యంబున యూథపతివోలె నున్న యన్న రేంద్రు నల్లన చేరి, యేనును నా యెఱింగినంత చెప్పెద నని యాజ్ఞగొని యవ్విభువదనంబున నిజవిశాలలోచన రోచులు పరగ వినయం బాననంబున నతిశయిల్ల"[1] హిత ముపదేశించెను.

---

1. భారతము - శాంతి అ. ౧ ప. 89

# ద్రౌపది తన్ను గుఱించి చెప్పుకొన్న ప్రకారము

ఆరణ్యపర్వమునం దందఱ మెదుటను శ్రీకృష్ణుని జూచి విస్పష్టముగ

సీ. ..."పాండుతనూజుల భార్యనై, పూజ్యుఁడ
వైన నీసఖియనై, యధికశక్తిఁ
బరగు ధృష్టద్యుమ్ను భగినినై, ధృతరాష్ట్రు
పట్టిచే సభఁ దలపట్టి యీడ్వఁ
బడి పాపకర్ముచేఁ బరిధాన మొలువంగఁ
బడి దారుణంబైన పరిభవంబు
పడితి ... ... ... ... "[1]

కం. శరణని యఱచిన నాలిం
పర, భీమార్జునుల బాహుబల మేమిటికిన్"[2]

అని మొఱవెట్టినది. ఇచ్చట గమనించవలసిన ముఖ్యాంశములు రెండు. మొదటిది, 'పరిధాన మొలువంగఁబడి' యని మఱుఁగుమాటు లేని విధంబున విస్పష్టముగా నుడువుట; ధీరురాలు. అబలయైన తనకు రక్షణంబు లేనియెడ నవమతి నొకఁడు కల్పించిన ఆపాపము, ఆనైచ్యము, ఆయధమత్వము తనకు జెందదు. ఇఁకఁ జెందవలసినది దుర్మార్గులైన కౌరవులకును మిన్నక చూచుచుండిన పాండవులకును. కాఁబట్టి చెప్పుటవలన తన కేమి తక్కువ?

---

1. భారతము - ఆరణ్య—ఆ౦ ౧ ప. 186

2. అందే—ప, 187

రెండవది, భర్తలయెదుట శ్రీకృష్ణునుద్దేశించి 'నేను నీసఖి' నని పల్కుట. తనశీలమునందుఁ, దనగౌరవమునందుఁ, దన జగదారాధ్యత యందు నెంతదృఢమైన విశ్వాసములేనిది పరపురుషునితో నిజపురుషుల యెదుట "నేను నీకుసఖిని, నీవు నాకుసఖుడవు" అని చెప్పఁజాలినది?

(ii) సత్యా ద్రౌపదీ సంవాదమునందు

"మఱియు ధర్మరాజు నగరియందుఁ గనకమణిమయభూషణా లంకృతులైన పరిచారకులు నూఱువేలు, రేయును బవలును బాత్రహస్తు లయి యభ్యాగత భోజనంబు లొడఁగూర్చువారు నందఱు కలరు. వీరెల్ల నిట్టిట్టి మెలఁకువ మెలంగుదురని తత్కృతాకృతంబు లేన యెఱుంగుదు. నిరంతర మదధారాతరంగిత కపోలంబులయిన భద్రగజశతసహస్రంబులుఁ బ్రభూత జవసత్త్వసన్నుతంబులైన యుత్తమాశ్వ శత సహస్రంబునుం గలవు. వానికి నన్నిటికి నిత్యోచితంబులైన ఖాద్యంబు లొనరింపను, బాలింపను దగినవారి నేన నియమింతు. అఖండభాండాగార పూరి తంబులైన యగణ్యమణిగణ కనకాది వస్తువులును బ్రతిదిన విహితంబు లైన యాయవ్యయంబులు నా యెఱుంగనియవియు లేవు. గోపాల జనంబులు తుదిగాఁగల సకల భృత్యజనంబుల జీవితంబుల నరసి యేన నడపుదు. పరమయశోధనులగు పాండునందనులు నిజకుటుంబభారంబు నర్వంబును నాయంద సమర్పించి తారు నిర్భరులై, యిష్టవిహారంబుల నుండుదురు. ఏనెల్లవెంటల నప్రమత్తనై వర్తింతు.

ఆ. వె. "వేగ జాము గలుగ వెడనిద్రఁ బొందుదుఁ
గాని రాజ్యభారకార్యయుక్తి
నబ్జనయన నాకు నాహారనిద్రల
కెడయులేదు సువ్వె యెల్లప్రొద్దు."

ఆ. వె. "ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియము సేయఁదగితిఁ గాని
మగువ నీవు చెప్పు మందులు మంత్రంబు
లింద్రజాలములును నే నెఱుంగ." 1

## (iii) సైంధవ దుర్నీతిఘట్టము

ద్రౌపది, తనకు రక్షకులు తనపురుషులేకాదు, కృష్ణుఁడు గూడఁ గలఁడని చెప్పుటయు గమనింపఁదగును.

చం. "అతులిత వృష్ణి కేకయ బలావళితోఁ బటుశంఖఘోష భీ
షిత భువనత్రయుండగుచు శీఘ్రతురంగరథాధిరూఢుఁడై
జితదనుజాన్వయుండు యదుసింహుఁడు వెన్నుఁడు ముట్టి నిన్ బరి
క్షత బలుఁ జేయ నాకు దెసగల్గు టెఱుంగుదుగాక యత్తఱిన్." 2

కృష్ణునియం దంత స్వాతంత్ర్యమున్న దీమెకు.

కం. ననుఁ బెఱ వనితల చందం
బున నవమానింప నీకుఁ బోలదు మత్పా
వన పాతివ్రత్యమహిమ
ననిశము నేకీడు నెందు నందదు నన్నున్. 3

ఎంతటి నమ్మిక తనమాహాత్మ్యమునందు ! సర్వశక్తి సమేతురా లట్లు పలుకువెరవు తనకు సహజము.

---

1. భారతము - అరణ్య-అ. ౫ ప. 307-309
2. భారతము - అరణ్య-అ ౬ ప. 185
3. అందే-188

ఉ. "పాప వినిశ్చయుండు సతిపయ్యెదకొంగు కడంగిపట్టినన్
గోపముతో నుదల్చికొని కోమలియున్ వెస వాని ద్రేయుడున్
బోపడి వాఁడు చిత్రముగ భూమి తలంబునఁ ద్రెళ్లె మారుత
క్షేప విభగ్నమూలమయి చెచ్చెరఁద్రెళ్లు మహీరుహంబనన్."[1]

సీతకు నీమెకు నుండు భేదములు గమనింపుడు. సీతయందుఁ బ్రతిఘటనములేదు; సాహసించి రావణుని మార్కొనలేదు; మఱి, రామ! లక్ష్మణ! దేవతలార! యని ఆక్రోశించినది. ద్రౌపదియొక్క ధైర్యచందము వేఱు.

(IV) ధర్మరాజు, చెల్లెలయిన దుస్సలను, దల్లియైన గాంధారిని దలంచి సైంధవుని జంపవలదని భీముని కాజ్ఞాపించునెడ ద్రౌపది ప్రతి వచనము:

"......అప్పాపాత్ముని దెసం గృపసేయవలవదు. అవశ్యంబు వాని వధించి నాకుఁ బ్రియంబు గావించునది. అట్టి ద్రోహి యెల్ల భంగుల వధ్యుండనియె"[2] ఇందలి స్వాతంత్ర్యము, సహజత్వము నరయునది.

పిమ్మట సైంధవుని పెడకేలుగట్టి భీమార్జునులు ద్రౌపదీధర్మజులకు నివేదించి "వీఁడె పాండవదాసుఁడనినఁ, బాంచాలియు జయద్రథుం జూచి భవదీయదాసుఁడయ్యెం గావున వీనిం బో విడువుండని విడిపించె"[3] విడిపించెననఁగా విడిపించినది ధర్మరాజు కాడు; ద్రౌపది.

---

1. భారతము - అరణ్య-ఆ. ౬ ప. 190
2. అందే-ప. 244
3. అందే-ప. 258

(v) విరాటపర్వములో

సీ. "ద్రుపదభూవిభుఁడు పుత్త్రులకంటె నెంతయుఁ
బెంపుసేయుచు గారవింపఁ బెరిగి
కుంతీ మహాదేవి కోడండ్ర లోపల
నగ్గలంబునఁ గొనియాడఁ బరగి,
ప్రాణంబులకు నెల్లఁ బ్రాణంబుగా మీరు
నెయ్యంబుఁ దియ్యంబు నెఱపనడచి
మదిఁ దలిదండ్రుల మాఱుగాఁ గొని జను
లనిశంబు భక్తిసేయంగ నెగడి

గీ. రూపగుణ విక్రమంబుల రూఢికెక్కి
నట్టి కొడుకులఁగని భరతాన్వయంబు
నందు నాయిల్ల యిల్లుగా నతిశయిల్లి
తగవుమై బాంధవులచేతఁ బొగడువడసి."[1]

ఉ. "ఏను మనంబు పెంపుసెడి యిప్పుడు నీచతరప్రభావముం
బూని నికృష్టనై యుదరపోషణకుం దగవేది యెంతయున్
దీనతఁబొంది యిమ్మెయి సుదేష్ణపనుల్ గనుసన్న చేయుచున్
హీనతనుక్కి మీకు వగపేమియుఁ జేయద యేమిసేయుదున్."

కం. "పని పంపఁగాని యొకతెకుఁ
బనిసేయ నెఱుంగ నన్నుఁ బనిగొనునెడఁ బాం

1. భారతము - విరాట - ఆ. ౨ ప 216

డుని యగ్రమహిషి గొంకుచుఁ
బని గఱపెడు చందముసన పనుచు టెఱుఁగవే." [1]

(vi) ఉద్యోగపర్వమునందు ద్రౌపది సంధి కూడదనియు, సమర మవశ్యకర్తవ్యమనియుఁ జెప్పుచు శ్రీకృష్ణునకుఁ దనకు నెంత స్నేహభావముగలదో యీతీఱున వివరించినది.

ఉ. "నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయుదు..............." [2]

సుభద్రకంటెఁ దనమీఁదనే కృష్ణున కెక్కువప్రీతియు, గౌరవము నని పల్కి

"నెట్టన యట్టియల్క మదినిల్పితి ; రక్కన తాల్మి చిచ్చెడిం
గట్టినయట్లు పెద్దయును గాలము, దీనికి నాఱువెన్నడుం
బుట్టదు, దుష్టనిగ్రహముపూని జగంబులఁ గాచునట్టి తోఁ
బుట్టువు నీవు తేజమునఁ బోల్చిన భర్తలు గల్గ నచ్యుతా" [3]

కృష్ణుని "నీవు నాకుఁ దోఁబుట్టువు" అని గొప్ప సభలోఁ గృష్ణుని రక్షకత్వ మాక్రమించుకొనినది.

(vii) విరాటపర్వములో భీమసేనునితోఁ దన భంగపాటు చెప్పుకొను సందర్భమున ద్రౌపది యనుచున్నది.

---

1. భారతము - విరాట-అ. ౨ ప. 218-219
2 భారతము - ఉద్యో-అ. ౩ ప. 1.0
3. అం దే-ప 118

కం. "గొంతికి నంతవెఱవ, మీా
కంతవెఱవ, దైవమునకు నంతవెఱవ న
త్యంత కలుషాత్ము విరటుని
కాంతకు నేవెఱతుఁ బనులు గావించునెడన్."[1]

"కావున మదీయ పరిభవాతిరేకంబునకు నీ వుద్రేకించిన జనంబులు మనల భేదింతురు. నీకుంబోలినభంగి రహస్యభంగంబు గాకుండ నరిభంగంబు సేయుము."[2] అని తన యవమాన మెంతయసహ్యమైనను తొందరపడి పని చెడకొట్టుకోరాదని భీము నెచ్చరించుచున్నది.

---

1. భారతము - విరాట-ఆ. ౨ ప. 185
2. అందే-ప. 208

సీ. " గారవంబున సుకుమారత్వమున నొప్పు
నిప్పొల్తిఁదలవట్టి యీడ్చి తెచ్చి
సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన
పెట్టంగ నచ్చటి పెద్దలెల్లఁ
బలుకకయుండ నబ్బన్నంబునకు నోర్వ
వలసె మీ కప్పటి కలఘు తేజ
నీ తేజమట్టులు నీఱయిపోయినఁ
బాండుని కులము సెప్పంగఁజూప

తే. గీ. లేకపోదె యబ్బంగిఁబల్కితి ముకుందు
తోడ నేను మీరెమ్మొయి రూఢికెక్కు
వెలుఁగఁగోరుట కతమునఁ దలఁచిదాని
ననిలసుతుఁడెత్తిపెట్టె నేమనఁగఁ గలదు " 1

---

1. భారతము - ఆశ్రమవాస-ఆ. ౧ ప. 168

సీ. ......................దు

శ్శాసనుఁ డీతండు సభకు ద్రుపద
పుత్త్రి నీడిచి తెచ్చి పొలువతనమ్మునఁ
బతులసన్నిధిఁ గురుక్షితి విభునకుఁ

తే. గీ. గర్ణునకుఁ జిత్తసంప్రీతి గాఁగఁ దూల
పుచ్చెఁ బెక్కువిధంబుల నొచ్చి యా మృ
గాక్షి యప్పుడు మారుతి యంతరంగ
మేర్చెఁ దలపించుదానన యింతపుట్టె"[1]

ఇదే యభిప్రాయము కుంతికిని ఉండినది. ఆయమ్మ గాంధారీ ధృతరాష్ట్రులతో నాశ్రమవాసము కయి వెడలుచుండ, ధర్మజాదులు పోవలదని ప్రార్థించునపుడు తమ తల్లిని జూచి,

"అయ్యమలాత్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రు నీ
వెయ్యది యుక్తహేతువుగ నిమ్మెయిఁ బాసెదు! నీదు పన్నునం
గయ్యముచేసి భూపతి నికాయములం బరిమార్చెఁ దల్లి నీ
కియ్యన లక్ష్మి నూఁది చరియింపక యిప్పుడువాయఁ బాడియే!"[2]

అని 'నీలక్ష్మిని నీవనుభవింపక యెట్లు పోఁగూడును? నీ మాట మీఁదనే గదా ధర్మరాజు యుద్ధముచేసి రాజ్యము సంపాదించినాఁడు.' అనఁగాఁ గుంతి "మిమ్ము యుద్ధమునకుఁ బురికొల్పినది రాజ్యముకొఱకుఁ గాదు, ఐహిక సుఖముల కొఱకునుగాదు; మఱి యెందుకనఁగా ద్రౌపదిపడిన పరిభవమునకుఁ బ్రతిక్రియచేసి పగతీర్చుకొనుటకు" అనెడి యభిప్రాయముతో నిల్లు బదులు వలుకుచున్నది.

---

1. భారతము - స్త్రీ-ఆ. ౨ ప. 55
2. భారతము - ఆశ్రమవాస-ఆ. ౧ ప. 159

## కుంతికి ద్రౌపదియందుండెడి ప్రేమ గౌరవములు

శ్రీకృష్ణుఁడు కుంతీసదనమునకుం జని యామెను జూచినపుడు, ఆమె ద్రౌపదిని గూర్చి విచారించుచుఁ జెప్పిన మాటలు.

"............అకట ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్" [1]

చ. "కొడుకుల కంటె నయ్యనఁగఁగోడలి నెక్కుడుఁగూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తికట కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగజేయుచుండు నదిపుణ్యచరిత్ర, కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁ జూడ సభదైన్యముఁ బొందుటఁజూచి పొక్కితిన్" [2]

తే. గీ. "నాఁడు ద్రౌపదివడిన బన్నములు సూడ
నోర్చినప్పుడ యెంతకు నోర్వఁజెపుమ!
యంత గడచిన దుఃఖంబు లనుభవింపఁ
గలవె లోకంబువారికిఁ గమలనాభ!" [3]

అత్తగారినే యట్లు స్వాధీనము చేసికొన్న కోడలు సామాన్యురాలా? మఱి యీయొక్కచోటనేగాదు కుంతి ద్రౌపదిని సుభద్ర కంటె నెక్కుడుగాఁ బరిగణించి పల్కుట పెక్కుతావులఁ గలదు.

భారతరణమునకు నిజమైన కారణము కౌరవులు ద్రౌపది యెడఁజల్పిన దుర్నీతియని గాంధారియొక్క యభిప్రాయము.

---

1. భారతము:- ఉద్యోగ—ఆ, ३ ప. 186
2. అందే—ప. 187

అందే—ప. 188

# సీతాద్రౌపదులు

సీతయు ద్రౌపదివలె లోకహృదయహారిణి; అయినను ఇంటి దీపము ; జగజ్జ్యోతికాదు. సభలకుఁబోదు. అట్టివానిలోఁ బ్రసంగించుటకు శక్తి రక్తి రెండును లేని గృహిణి. వాద ప్రతివాదములకు, సంఘర్షణ ప్రతిఘటనములకు, అననుకూలవచన శైలికి ఆమె పనికి రాదు ; శుద్ధపేలపిండి! బెల్లపుముద్ద. అల్లములేదు ఆపెనిర్మాణములో; మిరియము లంతకుమున్నె లేవు. ఎవరినైనఁ బరపురుషుల నుద్దేశించి 'నేను నీసఖి' నని సభవారెల్లరు వినునట్లు సహజసాధారణమును అలక్ష్యము నయిన భంగిఁ బ్రకటించునా? తుదికి మనస్సునైనఁ బరపురుషునకు సఖినైనట్టు లనుకొనునా? పాతివ్రత్యధర్మభంగమని యెంచదా పరపురుష సఖ్యము? మఱఁది లక్ష్మణుని ఎట్లుతూలనాడెనో మనకుఁ దెలియదా? ద్రౌపదియన్ననో, యీనాఁటి యమెరికాదేశపు నాయకురాండ్రను దాసీత్వబాధిత నీచత్వస్థితిగతులని తోఁపింపఁజేయునంత స్వతంత్రురాలు. ఈస్వాతంత్ర్యమున కాధారము ఆపెయొక్క ధర్మాధర్మజ్ఞత, వివేకము, రాజనీతినైపుణ్యము, జ్ఞానసంపద, ధీరత్వము, మహోన్నత శీలము, సర్వజనహృదయాకర్షక ప్రభావమును. ఆపె తన భర్తలను మందలించినను క్రమాతీతమని వారు నెంచరు; ఎవరును ఎంచరు. ఆపె అనన్యోపమామూర్తి; నిష్కలంక. అట్టివారిని దమ యింటివారేగాక యెల్లవారును బ్రేమింతురు, గారవింతురు, పూజింతురు. లోకారాధ్య మూర్తులు, వారియందు జగత్తంతయు సాయుజ్య గౌరవ మందఁ గోరును.

తెలియనివారు కొందఱు ద్రౌపదిని సాహసురాలని భావింపవచ్చును. నిజముగా నాపె ధీరురాలు. ఆపె వృత్తము నలంకార

ధోరణిగాఁ జూచిన కైశికీ ప్రధానము; అనఁగా శృంగారకరుణారస సంకలితము, అపుడపుడు ఆరభటి. రౌద్ర బీభత్సమయము. సాత్వతియు, వీరభయానక సమ్మిళితము. ఆపెయొక్క యుదాత్త స్వభావమునకు నింకొక నిదర్శనము చూపి యీలోకకళ్యాణియొక్క సాంగత్యము నింతటితో వదలుకొనుచున్నాను.

యుద్ధానంతరము ధర్మరాజు పశ్చాత్తాపముచేఁ జలించిన హృదయము కలవాఁడై, రాజ్యము విడనాడుటయకాదు; ప్రాణత్యాగము కూడఁ జేయవలెనను రీతిగా

కం. "ప్రాయోపవేశమున నీ
క్కాయంబు దొఱంగు తలఁపు గదిరెడు సంతో
పాయత్తచిత్తు నకటక
టా యని పోనిందు నను దృఢవ్రత యుక్తిన్." [1]

అని శోకవ్యాకులుఁడై చెప్పఁగా, ద్రౌపది "నీకేనా యిన్ని కష్టములు! నాకు మాత్రము లేకపోయెనా" అను రీతిగా

కం. "నాయట్లువడిన యంగన
లేయెడలం గలరె! యిట్టి యేనును ధర్మో
పాయము నీకగునను వెఱఁ
బాయన గృహధర్మవృత్తి కౌరవముఖ్యా." [2]

అనుట చూడఁగా, తనజీవితము తనసుఖమునకై, తానెన్నఁడు వినియోగింపలేదనియు, ధర్మోద్ధరణమే తనపరమాశయమనియు స్పష్ట

1. భారతము - శాంతి—ఆ. ౧ ప. 203

2. అందే—ప. 103

మగుచున్నది. కావుననే యీపెకు నింటిలోననకాదు, లోకమందంతటను వ్యాపించినది పూజనీయత. పండిత హృదయములకంటెఁ బామర హృదయములందు సహజమైన సత్యనిర్ణయశక్తి యెక్కువ. దీనికిఁ దార్కాణ, వేలకొలఁది గ్రామములలో ద్రౌపది దేవతగాఁ బూజింపఁ బడుటయు, నేఁటేఁట నుత్సవములతో నర్చింపఁబడుటయును.

పాండవులు ద్రౌపదినెంత గొప్పగాఁ బరిగణించి యామె తలంపులు తమతలంపులుగా, ఆమె కోర్కులు తమకాజ్ఞలుగాఁ బ్రవర్తించిరో తెలుపుటకు నింకను అనేక నిదర్శనములున్నవి. అయినను మీఁదఁ బేర్కొన్నవి యిప్పటికిఁ జాలును. ఆమె "ఉదితరవిచ్ఛవిన్...తనప్రభల్ వెలుఁగొందఁగఁ జేయు" నట్టి విస్మయావహామహనీయమూర్తి. ఆపెను బాండవులు గౌరవించుటయగాదు, ఆరాధించుట వారి జీవితపరమార్థము. వారి కామె భార్య; పరదేవత.

ఇట్టి యాపెను భాగవతకారుఁడు "పతులచేత నుపేక్షిత యయ్యె"నని తెలిపి యుండుటకుఁ గారణమేమై యుండవచ్చును? ఆ గ్రంథకర్తయుఁ, గవియు ఉదాత్తస్వభావుఁడు. తెలిసి యుద్దేశపూర్వకముగా ద్రౌపది కీగ్రహణము పట్టించి, కాంతిమాంద్యమును గల్పించి నాఁడనుట యుచితమని నాకుఁ దోఁపద. మఱి, తనకాలమునాఁడు విస్తరిల్లియుండిన భారతగాథ యారీతిగానుండి యుండవచ్చును. అనఁగా నీనాఁటి వ్యాసభారతసంహిత యానాఁ డేర్పడియుండదు. ఆ కాలమునాఁటి వినికిడినిబట్టి భాగవతాంశములు నిరూపింపబడినవని చెప్పుట న్యాయముకాని, యానాఁటి భారత మానాఁడుండియు నల్పమో చపలమో యయిన చేతస్సుచేత, భాగవతకర్త వైరుద్ధ్యప్రకటనలు చేసినాఁ డనుట సమంజసముకాదు.

ఇంతయేల? భాసుఁడు తన నాటకములందు భారతరామాయణ గాథలను వివరించి యున్నాఁడు. వానిలో ననేకాంశములు వ్యాస వాల్మీకేతరములు. భాసుఁడు కాళిదాసునకుఁ బూర్వుఁడు. కాళిదాసుఁడు సయితము వాల్మీకిని సంపూర్ణముగా ననుసరింపలేదు. అతనికిఁ బూర్వుఁడు పోయిన త్రోవ లింకను భిన్నములు. కాబట్టి, యిప్పు డుండు భారతము, పాండవుల తాత, సమకాలికుఁడు నయిన వ్యాసుఁడు స్వయముగాఁ జూచి, స్పృశించి యాఘ్రాణించి వ్రాసిన వృత్తము కాదు. అట్లే వాల్మీకి రామాయణముగుఱించియు.

---

౪

# అ వా ల్మీ క ము లు

అవాల్మీకములు - కంబఁడు

అవాల్మీకములు - గోనబుద్ధఁడు

# అవాల్మీకములు - కంబఁడు*

తమిళకవులలో నగ్రగణ్యు లనఁదగిన వారిలోఁ గంబమహాకవి యొకఁడు. మనకు గోనబుద్ధరామాయణ మెట్టిదో యతఁడు రచించిన రామాయణము తమిళుల కట్టిద. అఱవదేశమున రామాయణమన కంబరామాయణమ. కంబమహాకవియు వాల్మీకిని సంపూర్ణముగా ననుకరింపలేదు ; మఱి యార్యావర్తమునకు నెక్కువ సమీపమున నుండు నాంధ్రదేశములోని యెల్లరామాయణములకంటె వాల్మీకేతర ములను, తద్భిన్నాంశములను నెక్కువగాఁ బొందించినాఁడు. అట్టి లవాల్మీకములను దనరామాయణమునఁ బొందించుట కాలాంతర దేశాంతరములవల్ల నుత్పన్నములగు వికృతులకు గొప్పదృష్టాంతములు. అట్టివానిలోఁ గొన్నిటి నిటఁ జూపుచున్నాను.

1. శివధనుర్భంగమునకు మున్నె సీతారాముల పరస్పరావ లోకనమును, ఒకరినొకరు వలచుటయుఁ గంబరామాయణమునఁ గలదు. ( అనఁగా సీత శుద్ధముగాఁ బణముకాదనియుఁ, గొంతవఱ కింకు స్వయంవర లక్షణ మున్నదనియు భావము. పూర్వకాలమున నార్యులలో గొప్పగొప్ప కుటుంబస్త్రీలను సహితము విక్రయించుటయు, స్వయంవర వ్యాజమునఁ బణముగా నిచ్చుటయు సదాచారముగా నుండెను. ఇట్టి పణ్యస్త్రీత్వము ద్రావిడులకు నచ్చలేదు కాఁబోలు .)

2. దశరథుని మిథిలాప్రయాణసన్నాహము. వియ్యాలవారిని జనకుఁడు విడిదలల విడియించుట. అటఁ బుష్పాపచయము, జలక్రీడ,

* తమిళ కంబ రామాయణమును చిత్తూరువాస్తవ్యులు శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగా రిటీవల నాంధ్రీకరించిరి - చూడుఁడు నా రచించిన యాగ్రంథ పీఠిక.

మధుపానము మున్నగు వర్ణనము లవాల్మీకములు - అనఁగా తదనంత రాచారముల రీతి వ్రాయఁబడినవి.

3. భరతుఁడు తనకుఁ బితృకర్మలు సేయరాదని దశరథుఁడు నిషేధించును. వసిష్ఠుఁడు భరతుని వారించి శత్రుఘ్నునిచే శ్రాద్ధ విధులు చేయించును. (ఇది వాల్మీకములోని పరస్పరవైరుద్ధ్యముల నివారణ.)

4. కైకేయీ దోషము క్షమించి భరతుని పుత్రవాత్సల్య ముతోఁ జూడుమని రాముఁడు దశరథునిఁ బ్రార్థింపఁగా నతఁడు సమ్మ తించును. (సీతాగ్నిప్రవేశఘట్టము)

5. కంబరామాయణమునందలి సీత "రాక్షసులతో మనకేల విరోధము" అని రాముని వారింపదు; లక్ష్మణుని కఠినోక్తులాడదు. నీ విటనుండి వెడలకున్నచో చిచ్చుఱికెదనని లక్ష్మణునితోఁ బ్రతిన సేయును. (ఎక్కడఁ జూచినను చిచ్చులు ప్రజ్వరిల్లు కాలమేమో యది!)

6. ఇందలి రావణుఁడు సీతను నేలతోఁ బెల్లగించికొని పోవును. ఇది తదనంతరము దేశములో వ్యాపించిన పాతివ్రత్యధర్మోద్ధరణకై వ్రాయఁబడిన మాట. సీతను రావణుఁ డంటినయెడల ఆపెయొక్క పరమపావనత్వము చెడునని గడ్డపాఱతో గుంత త్రవ్వి, ఆమె అక్కడనే స్థిరముగా నిలిచి యుండఁగాఁ, బెల్లగించికొనిపోయినాఁడని చెప్పుట ఆపెయొక్క శుచిత్వము చెడలేదనుట. నిజమైన క్షాత్రగుణప్రకాశి తంబులైన వీరయుగములందలి స్త్రీలకు నిట్టి సందర్భములందు బలాత్కారప్రజనితదోషములంటినట్లును, తద్ద్వారా వారికులముగాని, గౌరవముగాని చెడినట్లును ఎక్కడనులేదు. దుశ్శాసనుఁడు ద్రౌపదిని,

ఏకవస్త్రను, రజస్వలను దలపట్టి యీడ్చుకొని వచ్చి సభలో విగత వస్త్ర గావించినను, ఆమెను సైంధవుఁడు బలాత్కారముగాఁ బట్టుకొని రథముపై నిడుకొని పోయినను, కీచకుఁడు వీథిమధ్యమున నందఱు యెదుటఁ దన్ను క్రిందపడునట్లు చేసినను ఆమెయెడ భారత స్త్రీపురుషులలో నెవరికైనను అసహ్యతగాని యగౌరవముగాని కలిగెనా? వాల్మీకమునందు సీతాదేవిని తొడలక్రిందఁ జేయివైచి యెత్తికొని పోయెనని చెప్పఁబడి యున్నను దానిచే సీతయొక్క పేరుప్రతిష్ఠలకు నేమాత్రమయిన న్యూనత గల్గెనా? రామాయణకాలమునాఁటికే యీవిషయమునందు హిందూసంఘచరిత్రమునందుఁ గొన్ని మార్పులు గలిగి యుండెను. తన్ను భుజములపై నిడుకొని రామునొద్దకుఁ దీసికొని పోదునని ఆంజనేయుఁడు పల్కఁగా, సీత, యాతఁడు రామభక్తుఁడని యెఱింగియుఁ "బరపురుషుల నంటను. కావున రాను" అని వచించుటను, ద్రౌపది ఘటోత్కచునిపై స్వారిచేయుటతోఁ బోల్చి చూడుఁడు. ఈకాలపు ఐరోపా, అమెరికా స్త్రీలు పురుషుల సంగతిని జరించుట వారికి శీలము లేకపోవుటవలననా? అఖండముగ, సంకోచమునకు నతీతముగా, నుండుటవలననా? యోజింపుఁడు.

మనవారికి బలమును క్షాత్రమును గొంతవఱకు క్షీణస్థితికివచ్చి స్త్రీరక్షణమునకుఁ దగినంత శక్తిలేకపోవుటవలన, బలములేనివాఁడు సంశయాత్ముఁడు కనుక, పాతివ్రత్యముపేరిట నీతులు నిర్బంధములు హైందవులలోఁ బ్రబలెనని తోఁచెడిని.

7. లక్ష్మణుఁ డడవిలో నొకరేయి నీరు తేఁబోఁగా, అయోముఖి యతని మోసగించి మచ్చుచల్లి, కొనిపోవును. రాముఁ డతనిఁ గూర్చి మిక్కిలి విలపించును, వెదకును. (ఇది హనుమదుపాసకుల సృష్టి కాఁబోలు)

8. రాముఁడు మాంసాహారికాఁడు: గుహుఁడు తేఁగా వలదనును. (ఆర్యులు మాంసాహారులు, దాక్షిణాత్యులలో శైవసిద్ధాంతము ప్రధానమతము. బ్రాహ్మణేతరులు సైతము శాకాహారులు. రామునికిఁ గంబరామాయణమున ఆగతి పట్టుట సహజము.)

9. వాలిని, రావణుని ఈగ్రంథకర్త యెక్కువ గారవించినాఁడు. (వాలి ద్రావిడదేశీయుఁ డగుటయు, అన్యాయముగను, అధర్మముగను, జంపబడినవాఁడవుటయు ఈ ఆదరణకుఁ గారణములా?)

10. వాలి భార్యయగు తార పతివ్రతగాఁ జిత్రింపఁ బడినది. సుగ్రీవుఁడామెను దల్లిగా భావించి విధేయతతో వర్తించును. (ఎన్నాళ్లిట్లు చూచెనో తెలియదు. కాని మన వైవాహిక సంప్రదాయములలో "తారా మండోదరీ చైవ" అని మండోదరివంటి పతివ్రతగా తార పేర్కొనఁబడి యున్నది. అయిన నొక ప్రశ్న. ఏకపతిత్వముకాక బహుపతిత్వము సదాచారముగా నుండినయెడల అపుడుపాతివ్రత్యము అసంభవమగునా? ద్రౌపదికంటె మించిన పతివ్రత లెవరు?

11. లక్ష్మణుఁడు కిష్కింధకేఁగి వైధవ్యమునొందిన తారను గాంచినంతనే తనతల్లులు జ్ఞప్తికి వచ్చి కనుల నీరునించును.

12. అన్నను జంపింప యత్నించిన సుగ్రీవుని మనము నమ్మి ప్రవర్తింపఁ దగునా యని లక్ష్మణుఁ డన్నతోఁ బలుకును. (చాల మంచిమాట. అయినను రాజకీయములలో బలము సేకరించుటయ ప్రధానమైననీతి. మంచివారినిగాదు మనప్రక్కకుఁ జేర్చికొంట, మన ప్రక్కకు వచ్చిన వారెల్లరు మంచివారు.)

13. విభీషణుఁడు రాజ్యకాంక్షతో వచ్చినాఁడు కాన మనలోఁ జేర్చుకొనవచ్చునని హనుమంతుఁడు రామునకుఁ దెలుపును. (విభీషణుఁడు నీచపాత్రము. ఇన్నాళ్ళు గ్రుక్కుమిక్కుమనక యూరకయుండి బలవంతుఁడు పై నెత్తివచ్చుటతోడనే అన్నపై ధర్మశాస్త్రము ప్రయోగించిన 'పెద్దమనిషి'! రాజ్యకాంక్ష తనయాశయ మైనందున తప్పక తనప్రక్కననే యుండునని హనుమంతుని నీతివాదము.)

14. విభీషణుని భ్రాతృద్రోహము నెత్తిపొడిచి యింద్రజిత్తుని నోటఁ గవి యతనిని దిట్టించును. (దాక్షిణాత్యకవులలో విభీషణ వ్యామోహ మంతగా లేదు. అన్యులకు సాహాయ్యము చేసినందు చేతనా?)

15. గుహలోఁ దగుల్కొన్న హనుమదాదులను స్వయంప్రభ మంత్రబలముచే వెలికిఁ దెచ్చినట్లు వాల్మీకమునందుఁ గలదు. స్వయంప్రభ తన్ను వేఁడఁగా హనుమంతుఁడు తలతో డీకొని గుహాపైభాగమును భేదించి దారికల్గించును.

16. విభీషణుఁడు రావణునకు నీతిగఱపు సందర్భమున హిరణ్యకశిపు చరిత్ర నుగ్గడించును.

17. ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగపాశము గాని బ్రహ్మాస్త్రముగాని రాముని బంధింపలేదు. (ఎట్లు బంధించును? ఆయన దేవుఁడుగదా! దేవుని దేవిగారు తప్ప నింకెవరు బంధింపఁగలరు?)

18. కుంభకర్ణుఁడు యుద్ధమునకు రాఁగా విభీషణుఁ డతనితో సంభాషించి రామపక్షమునకుఁ ద్రిప్పయత్నించి విఫల మనోరథుఁ

డగుట. (కుంభకర్ణునిలో క్షాత్రమెక్కువ. సమయోచిత ధర్మశాస్త్రము తక్కువ)

19. రావణుఁడు సీతకు రాముని శిరోధనువులఁ జూపి బెదరించుటలేదు. మాయజనకుని గల్పించి సీతకు దుర్నీతులు గఱపి యామె మనసును ద్రిప్పఁజూచును.

20. రావణుఁడొక్కసారియే రామునెదుట నిల్వలేక విహ్వలుఁడయ్యెను. రెండవసారి స్థైర్యముతో నిలిచి పోరి ప్రాణములు విడిచెను.

21. మాల్యవంతుఁడు రాముని విష్ణువుగా శంకించి దృష్టాంతములతో రావణునకుఁ దెలుపును. ఇంద్రజిత్తు తనబ్రహ్మాస్త్రము అతనిని జెనకక పోవుటచే రాముఁడు విష్ణువై యుండునని సంశయించి తండ్రికిఁ దెలుపును.

22. వాల్మీకి శత్రుఘ్నుని గుణములఁ గూర్చి మెచ్చుటను బ్రస్తావింపలేదు. భరతుఁ డగ్నిప్రవేశము సేయనిశ్చయించి శత్రుఘ్నుని గాంచి యీరాజ్యము నీవు కాపాడుచు రాముఁడు వచ్చునంత నతనికి నప్పగించుమని తెలుపఁగా నతఁడు

చ. "జనకుని సత్యవాక్యనిగఁ జల్పఁగ, నన్నవనిం జొరంగ, సే
వన మొనరింపఁ గానలకుఁ బ్రాతిగ దమ్ముఁ డొకండు వోవ, రా
ముని పునరాగమావధియుఁ బోవఁగఁ, దమ్ముఁ డొకండు జీవముల్
తనుకఁగ వీడుచుండఁ, గడతమ్ముఁడు రాజ్యము సేయుఁ జెల్లరే.

చ. అడవుల నన్నయుండఁ, బురమందలి భోగములందె తమ్ముఁడ
న్నుడి జగమాడునంచు మదినొచ్చి తపించుచునుండి యగ్నిలోఁ
బడుచును బిన్నతమ్ముఁ డోదవంగలఁడంచుఁ దలంతుఁగాక యీ
యెడరుసహించి యేఁబ్రదికి యేలఁగఁబోలునె యీధరాస్థలిన్.”[1]

అని యుత్తరమిచ్చెనని, శత్రుఘ్నుని మిక్కిలి కొనియాడఁ దగినతీఱున గౌరవించియున్నాఁడు కంబకవి.

---

1. శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి కంబరామాయణము. యుద్ధకాండము-
శ్రీరామ నివర్తన పటలము. ప 1809 - 1810

# అవాల్మీకములు - గోనబుద్ధుఁడు

రంగనాథ రామాయణములో నవాల్మీకము లనేకములున్నవి. వాల్మీకి రామాయణమునకిది యథామాతృకమైన పరివర్తనము కాదు. నూత్నవిషయము లుండుటయేగాక కొన్ని ప్రాచీనములు సహితమిందు వికృతులను జెందియున్నవి. ఇందుచేత వాల్మీకేతరము లన్నియుఁ బ్రక్షిప్తములని భావింపనగునా? గోనబుద్ధారెడ్డి గొప్ప పండితుఁడు కాఁడని యీవఱకే వ్రాసియున్నాను. అట్లని, కేవల పండితమాత్రుఁడు కాఁడు. కాఁబట్టి తనదేశమునందుఁ, దన కాలమునందు ఊరుకుథలుగను వీధిపాటలుగను, కీడు కాదులేని సామాన్యజనులలో వారిహృదయముల భావముల కెక్కినరీతి వ్యాపించి యుండిన రామాయణ సంబంధి గాథలను, బాత్రలయొక్క రూప నిర్మాణములను దా నవలంబించి స్వీకరించెననుట శుద్ధముగ అనాదర ణీయమైన యోచనయా? ఇట్టివి దేశకాలానుగుణరచితములు గాక నిర్హేతుక విశ్వామిత్ర సృష్టులా? కావున గోనబుద్ధ ప్రతులను గుఱించిన సత్యాసత్యవిచారము సాహిత్యము ననుసరించి చేయవలయునే గాని, చెదలుదిన్న ప్రతులను జూచి కాదు.

కాలాంతర దేశాంతర స్థితిగతుల ననుసరించి, జనులలో సర్వ సామాన్యముగా నావేశించి యుండు నితిహాసములు కవిసృష్టికి మూలా ధారములుగా నుండినప్పటికిని, దానిమీఁద ప్రజాసృష్టికిఁ జెందిన నానావిధములగు మార్పులను, జనాభిరుచిని అవి పెంపొందించుననుటకుఁ బూర్వప్రకరణమున భారతభాగవతములనుండి చూపిన విమర్శనములే కాక రామాయణమును బట్టియు విస్పష్టముగ నిరూపింపనగును.

"దశరథుఁడు...పెండ్లియయ్యె మువ్వురు సతులన్ "[1]

వ. "అందు కౌసల్యకు రాముండును గైకేయికి భరతుండును సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులును జనియించిరి. "[2]

దశరథుఁడు అందఱవలె సాధారణముగనే బిడ్డలను గనిన ట్లున్నది. పుత్రకామేష్టివలనఁగాదు. పాయసపానంబునంజేసియుఁగాదు. పుత్రకామేష్టి లేకపోవుటయకాదు, "నిజసుకృత పరిపాకంబునంజేసి కనియె "[3] ఇది హిందువులలో సాధారణముగా నుండుభావము. అనఁగా పుణ్యములచేతఁ బుత్రులు కలుగుదురని, భార్యచేత కాదని.

రావణుఁడు తన తలల నొక్కొకటొక్కటిగాఁ దొమ్మిదిటిని ఖండించి వేల్చి, ధైర్యంబు తఱుగక పదియవ తలయుఁ ద్రెంప నమకట్టి నపుడు బ్రహ్మ ప్రత్యక్షమైనట్లు భారతములో.[4] ఇది వాల్మీకములో లేదని తోఁచెడిని. కొన్ని శతాబ్దములు గడచిన పిమ్మట నీ యర్పణము బ్రహ్మకుగాదు, శివునకని.

"కృత్తాత్మ శిరములు నెత్తమ్ము లెవ్వాని
నీలకంఠార్చనా నియమములకు "[5]

వాల్మీకమునఁ గైక భర్తచేఁ బడసిన వరములు రెండు. భారతమునం దొకటి మాత్రము.

---

1. భారతము - అరణ్య—అ. ౬ ప. 268
2. అందే—వ. 269
3. అందే—వ. 294
4. అందే—వ. 279
5. కవికర్ణరసాయనము - అ.

కం. "ధరణీశ, తొల్లి నాకుం,
గరుణించిన వరమొకండు గలదు..."[1]

తే. గీ. "......ఉరువర మ్మిదియ నాకు"[2]

అని యేక వచనము.

రామ పట్టాభిషేకమునకుఁ బూర్వము భరతుని మేనమామ గారి యింటికిఁ బంపినట్లు భారతమునందుఁ గానము. రామపట్టాభిషేక విషయములో నేదోయొక కుట్ర పన్నబడి యుండెనను సంశయమునకు భారతములో నవకాశములేదు. వాల్మీకిరామాయణమునఁ గలదు. రంగనాథములో శ్రీరాముఁడు తనకు జరుగఁగల శుభమును కౌసల్యా సుమిత్రలకుఁ దెలుపును. కైకేయికిఁ దెలుపఁడాయె.

భారతప్రకారము వాలిసుగ్రీవులకు జరిగినది యొక్కటే యుద్ధము. రామాయణము నందు జరిగినది రెండుసార్లు. నాకుఁజూడ భారతగాథయే యెక్కువ సహజముగను, విశ్వసనీయముగను ఉన్నది. ఏలన, దెబ్బలుతిని పరుగెత్తికొని పోయినవాఁడు అంతత్వరలో పునర్యుద్ధమునకు వచ్చుట యరిది. ఆంజనేయుఁడు తగు సమయములో "సుగ్రీవు నఱుత పల్లవ దామంబు నిడఁగ రాఘవుఁడు వాలి యెవఁడని యెఱింగి యమోఘబాణములతో వానిని జంపుట"[3] కొంత వఱకు, భీమదుర్యోధనుల ద్వంద్వయుద్ధమందు అర్జునుఁడు తొడలుతట్టి సంజ్ఞచేసిన విషయమును బోలియున్నదా? లేదా? సమయమునకు సంజ్ఞసేయుట యీ రెండిటికిని సామాన్యము.

---

1. భారతము - అరణ్యా—ఆ. ౬ ప. 300
2. అందే—ప. 302
3. అందే—వ. 38

భారతరాముఁ డుంగరమును హనుమంతున కీయలేదు. తన కార్యము సుగ్రీవుఁడు నెఱవేర్పలేదను మనస్తాపముతో లక్ష్మణు నాతని కడకుఁ బంపుచు 'నొకవేళ సుగ్రీవుఁడు మనకుఁ దెలియక యింతకు మున్నె యత్నములు చేసినాఁడేమో! అట్లయిన వానినేమియు ననఁ గూడ' దనుభావముతో శ్రీరాముఁడు

ఆ. వె. "నీవు ననకమున్న నెఱితోడ మనకార్య
మునకుఁ దగిన యత్నములు ఘటించి
యుండెనేని వాని నొండేమియుం జేయ
వలదు తోడితెమ్మవార్య శౌర్య"[1]

అని చెప్పినాఁడు. ఇదిశాంతుల స్వభావము, నీతిమంతులయు.

కోపముతో సుగ్రీవుని గదిసి లక్ష్మణుఁడు 'నీవు కృతఘ్నుఁడవు గదా' యనెడు నేర మారోపించినపుడు సుగ్రీవుఁడు

"అయ్యా! నేనేల కృతఘ్నుఁడ నగుదు? జానకి నన్వేషించుటకున్నై బలవంతులు బుద్ధిమంతులు నగు వానరుల ననేకుల నలు దెసలకుం బనిచితి. వారును సకలవనశైల సాగరగ్రామ నదీసహితంబైన భూచక్రంబు నందెల్ల రోసి యొక్కమాసంబులోన గ్రమ్మఱి వచ్చువారై సమయంబు చేసిపోయిరి. ఇంక నైదు దినంబులు కొఱంత; యింతియ. అటమీఁద వైదేహివార్త గొనుచు దేవరం గొలువవచ్చువాఁడనై యున్నవాఁడ"[2] అని వినీతుఁడై సమాధానము పలికెను. ఇచట ఆంజనేయుఁడు రామునిచేతఁ బంపఁబడి పోయి యుండలేదు. ముద్దుటుంగరము నిచ్చుటగాని పుచ్చుకొనుట గాని సంపూర్ణముగా నసంగ

1. భారతము - అరణ్య-అ. ౭ ప. 4

2. అందే- ప. 6

తము. ఆంజనేయుఁడు లంకలో సీతను జూచినదాని కానవాలుగా ఆపె యిచ్చిన శిరోభూషణమును శ్రీరామునకు నప్పగించెను. ఇది సహజమైన వృత్తాంతమని తోఁచెడిని. హనుమ సీతను జూచినాఁడు ; సీత తన యునికి రాముని కెఱుక పఱుప నెంచినది. అప్పు డానవాలుగా నేదేని గొనివచ్చుట హనుమంతునకును, అభిజ్ఞానముగా నేదైన నొసఁగుట సీతకును తమంత తమకుఁ దోఁచునట్టి కృత్యములు. రామునిచేత నంగుళీయమును గొని సీతకు నిచ్చినది, తరువాత హనుమత్ పూజా ధురంధరులచేఁ గల్పితమైన వృత్తాంతమా ? కాదా ? ఒకవేళ వర్తమాన వాల్మీకమునం దున్నట్లు కపినాయకు లందఱు శ్రీరాముని వలన సైలవుగైకొని వెడలిరనుకొందము. ఏ వివేకవంతుఁడైనను సరే వారిలో నొక్కనిని మాత్రము ప్రత్యేకించి యాదరించి 'నీవుతప్పక నాకార్యము చేయుదు' వని గౌరవించి యుంగర మిచ్చి యుండునా? ఇది తక్కినవారి కవమతి చేసినట్లు కాదా! మఱి యాతఁడు నిశ్చయముగా కార్యము నెఱవేర్చునని స్థిరబుద్ధియుండు నెడల, నితరులను వ్యర్థముగఁ బంపనేల ? ఈ సుందర కాండములోని కొన్ని ఘట్టములను బరిశీలించిన యెడల

ఆ. వె. "కనకమృగము భువిని గలదు లే దనకయే
తరుణి విడిచిపోయె దాశరథియు,
తెలివి లేనివాఁడు దేవుఁడెట్లాయెరా"

అని వేమన రాముని గుఱించి చెప్పిన తిరస్కార వాక్యములో గొంత సత్యమున్న దేమో యని సంశయమయ్యెడిని.

మఱియు, నాల్గుదిక్కులకు నన్వేషకులఁ బంపనేల ? రావణుఁ డెత్తికొని పోయినాఁడని తెలియును. ఆతని నివాసస్థలము లంక

యనియుఁ దెలియును. రావణుఁ డనామధేయుఁడు కాఁడు. వానిస్థలము దెలిసియు నితరదిక్కులకు సైన్యములఁ బంపుట కేమి కారణము? మఱి లంకకుఁ బంపుటయు నేల? సీతను జూచివచ్చుటలో గుణమేమి? ఈప్రొద్దున నాపెనొక చోటఁబెట్టియున్నవాఁడు, దర్శనానంతర మింకొకచోటికి మార్పఁగూడదా? మార్పఁజాలఁడా? ఈ విషయము నింతటితోఁ జాలించి వ్యాసవాల్మీకులకుఁగల భేదము ననుసరింతము.

వాల్మీకములోఁ గుంభకర్ణుని సంహరించినది రాముఁడు; భారతమున లక్ష్మణుఁడు. ఇది యలక్ష్యమైన మార్పుగాదు. పెద్దన్నను బెద్దవాఁడు, చిన్నన్నను జిన్నవాఁడును జంపెననుట యెక్కువ స్వాభావికమైన రీతి. తమ్ముఁడైన విభీషణుని తనయొద్దకుఁ జేర్చుకొని యన్నయైన రావణుని సంహరించుటయు ఈభ్రాతృసూత్రము ననుసరించిన కార్యము.

భారతమున సీత యగ్ని ప్రవేశము చేయలేదు. సీతారామ సమాగమము నలదమయంతీ సమాగమమునకు శకుంతలా దుష్యంతుల పునస్సమాగమమునకు సరిపోలియున్నది. ఈపద్యములను దిలకింపుఁడు. శ్రీరామునిమాట:

సీ. అధికదుష్టాచారుఁడైన దశాననుఁ
డింతకాలముఁ దనయింటఁ బెట్టి
కొనియున్న నిన్ను గైకొనిన నస్మచ్చరి
త్రమునకుఁ దొడరదే ధర్మహాని?
పరిభవంబునకునై ప్రతికారముగ వైరిఁ
గూల్చితిఁగాని నీకొఱకుఁ గాదు
మొఱఁత నీచరితంబు మేలైనఁ గీడైన
గానిమ్ము నిన్ను నిక్కముగ నొల్లఁ

ఆ. వె. "బరగఁ గుక్కవాతఁబడిన హవ్యము భంగి
యయ్యొ నీ తెఱంగు నరయ నిపుడు
గాన నిచటఁ దడయఁగాదు చెచ్చెర నీ
విష్టమైన కడకు నేఁగు మతివ"

ఆ. వె. "అనిన చెవులఁ గొఱవికొని చూఁడినట్లైన
దాల్మి పెల్లగిల్లఁ దరళనయన
మొదలు నఱక నొఱగు కదళిచందంబున
నెలఁత తల్లడమున నేల వ్రాలె."

... ... ... ... ...

... ... ... ... ...

తే. గీ. "పడఁతి యల్లన మఱికొంత వడికిఁ దెలిసి
యలసమూర్తియై దందడి నశ్రులురులఁ
గేలు మొగిడించి వసుమతీపాలుఁ జూచి
మెలుఁగు కుత్తుక తగులంగ నిట్టులనియె"

కం. "నినుఁగీడు వొరయ కుండఁగ
జనులకు నానిక్క మెక్క జననాయక నే
ననలంబుఁ జొచ్చి వెడలెదఁ
గనుఁగొను మిచ్చనవు నాకుఁ గరుణింపు దగన్."

ఉ. "నాదగుబుద్ధి నీదు చరణస్మరణంబ యొనర్చుఁగాని, యొం
డేదియు నెన్నఁడుం దలఁప దిట్టిద యిందొక చందమైన ని
మ్మేదినియుం గృశానుఁడు సమీరుఁడు శీతకరుండు నర్కుఁడుం
గాదన కీక్షణంబ ననుగాల్పరె! వేల్పులు చెట్ట సైఁతురే?"

... ... ... ... ...

వ. "అనంతరంబ సకలసురగణమునిసహితంబుగాఁ బితామహుండు సనుదెంచి రాఘవుచేత సత్కృతుండై యిట్లనియె. 'అయ్యా నీవు సకలభూత దుస్సహుండైన రావణుం బరిమార్చి లోకహితంబు చేసితివి. వినుము. నలకూబరు శాపంబునంజేసి దశగ్రీవునకుఁ బరస్త్రీల యందు బలాత్కారంబు సెల్లదుగావున నీధర్మపత్నియందొక్క దురితంబునుం బొరయదు. నీవు నిర్విచారుండవై యిప్పతివ్రతం బరిగ్రహించి నెమ్మదిఁ బురంబున కరుగు'మని...పరమేష్ఠి చనియెనంత

మ. "అవిరోధంబున జానకీ సహితుఁడై యాబద్ధరత్నప్రభా
నవ పుష్పంబగు పుష్పకంబను విమానం బెక్కి యర్కాన్వయ
ప్రవరుం డిమ్ములనేఁగె సమ్మదభరప్రాగ్భారవారాకర
ప్లవమానుండగుచుం బురంబునకుఁ బ్రాప్త శ్రీ విశేషోన్నతిన్" [1]

వాయుదేవుఁడు బ్రహ్మదేవుఁడు సాక్ష్యమిచ్చినపిమ్మట నగ్ని పరీక్ష యెందుకు ?

నలదమయంతీ సమాగమఘట్టమును దీనితో సరిపోల్చి చూడుఁడు. నలుఁడు ద్వితీయస్వయంవర విషయమున మనస్తాపంబు చెంది దమయంతి నిట్లాక్షేపించును.

వ. "ఏ నిందులకు నీతదర్థంబ వచ్చితి నని యట్లుండె. నన్ను ననురక్తు ననువ్రతుఁ దలంపక యన్యాపేక్షం బునస్స్వయంవరంబు రచియించుట యిదికులస్త్రీ ధర్మంబుకాదు. రాజులనెల్ల నీ స్వయంవరమునకు రావించుటం జేసికాదె ఋతుపర్ణుండు వచ్చె ననిన వెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె.

---

1. రతము - ఆరణ్య- ఆ. ౭ వ. 157-166

ఉ. "ఏనొక పాపభావమును నెద్దఁ దలంపక యుండునట్లుగా
నానతవైరి, నీయడుగు లంటఁగ నోపుదు ; నట్టిదైన న
న్నీ నలినాప్తుఁ డీయనలుఁ డీమృగలాంఛనుఁ డీసురోత్తముల్
జాను సెడంగ నీక్షణముచంపరె కోపపరీత చిత్తులై"

( సీతాదమయంతుల శపథములు రెంటను సమానము )

వ. "అనుచున్న యవసరంబున నఖిలభూతాంతర్గతుండైన వాయుభట్టారకుం డెల్లవారలు విన నాకాశమునుండి నలున కిట్లనియె.

చం. "అమలచరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కుదే నృపో
త్తమ, విను దీనియందు విదితంబగు శీలవిధిన్ సుధాంశుఁడున్
గమలహితుండు నేమయి గాచితి మొక్కట మూఁడువర్షముల్
గొమరుగ దీనిఁ జేకొనుము కోమలి నీ కనురక్త నావుడున్"[1]

శకుంతలా దుష్యంతుల సమాగమము నిట్టిది. దుష్యంతుఁడు తన్ను స్వీకరింపక నిరాకరించినపుడు శకుంతల తనసత్యమును బ్రకటించు రీతి యిట్లున్నది.

చం. "విమలయశోనిధీ, పురుషవృత్తమెఱుంగుచు నుండుఁజూవె వే
దములును బంచభూతములు ధర్మువు, సంధ్యయు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివియుండఁగా నరుఁడు తక్కొనఁనేర్చునె తన్నుఁ బ్రచ్చిలన్"[2]

అని దుష్యంతుని శపియించు విధమున కఠినముగ

1. భారతము - అరణ్యము-అ. ౨ ప. 10 – 16

2. భారతము - ఆది-అ. ౪ ప. 79

కం. "సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁజూచు నతి దు
ర్మతి కిహమ్ముం బరముఁ గలదె? మతిపరికింపన్" [1]

అని చెప్పి

కం. "నీ పుణ్య తనువు వలనన
యీపుత్త్రకుఁ డుద్భవిల్లె నెంతయు నొప్పన్
దీపంబువలన నొండొక
దీపము ప్రభవించినట్లు తేజంబెసఁగన్." [2]

మ. "విపరీత ప్రతిభాష లేమిటికి నుర్వీనాథ! యీపుత్త్రగా
త్రపరిష్వంగ సుఖంబుఁ జేకొనుము ముక్తాహార కర్పూరసాం
ద్రపరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే" [3]

కం. క్షత్త్రవరుఁడైన విశ్వా
మిత్త్రునకుఁ బవిత్రమైన మేనకకున్ స
త్పుత్త్రినయి పొంకువలుకఁగ
ధాత్రీతలనాథ యంత ధర్మేతరనే" [4]

అని కరుణయుఁ గాఠిన్యమును గలియునట్లు పురుషుని మంద
లింపుతోడి వేఁడుకొనుటయుఁ జేసినది. అపుడు

---

1. భారతము - ఆది-౪ ప 81
2. అందే-ప. 89
3. అందే-ప. 90
4. అందే-ప. 97

చం. "గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు చే
  కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె- సాధ్వి స
  ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి తా
  వినిచె ధరాధినాథునకు విస్మయమందఁగ దత్సభాసదుల్"

ఆకాశవాణియు, సకలభూతములు సాక్ష్య మిచ్చుటయు ఈమహోత్తరఘట్టములందు సరిసమానము. మఱియొక విశేషము. ఈ చరితములు మూఁడును పౌరాణిక యుగమునకుఁ జాల పూర్వమయిన వైదికకాలమునకుఁ జెందినవి. కావుననే ప్రమాణములు చేయునపుడు తదనంతర దేవతలైన శివకేశవులమాట లేదు. అగ్ని సూర్యుఁడు, చంద్రుఁడు వాయువు ఇత్యాది వైదికదైవతములనే సంబోధించి ప్రతిమాలుకొనుట. మఱియు నాకాలమున హిందువులలో సత్యము సమగ్రము. అబద్ధమాడుట యెక్కువగాలేదు. కావున జనులలో పరస్పరవాక్యములయందు సహజవిశ్వాస ముండినట్లు తోఁచెడిని. దమయంతి బావిలో పడ పనిలేదు. సీత యగ్నిలో నుఱుక నవసరము లేదు. వారి మాటలే చాలును. సత్యసచ్ఛీలోత్కృష్టములయిన కాలములయందు నిట్టిపరస్పర గౌరవభావము లుండెననుటలో ఆశ్చర్యమేల ? ఏ కారణముచేతనో మనవారిలోఁ బూర్వముండిన యీ యుదాత్తమైన శీలముపరిక్షీణమగుచు నొకరియం దొకరికి నమ్మకము కృశించి 'నిప్పులో పడు, నీళ్ళలో పడు' ఇత్యాది విపరీతములైన పరీక్షలకుఁ బాల్పడఁజేసినట్లు తలచుటలు వ్యాపించినట్లు తోఁచెడిని. ఈయగ్నిప్రవేశమునకుఁ గారణము స్పష్టము. 'నేనుచేయుదునా' యని సీతాదేవి సాహసించి చెప్పినమాట మీఁద 'కాలాంతరమునందుఁ జేసెను' అనుగాథ యేర్పడినది. ప్రాణముమీఁద విసుగెత్తి ఆ యమ్మ

యన్న యీ నిరాశావాక్యమును మానసంరక్షణార్థమై చెప్పి చేసిన కృత్యము నట్లు భావించిరేమో!

కాలాంతర దేశాంతరములచే గలుగు విశ్లేషులకు మఱియొక దృష్టాంతము.

వాల్మీకి రావణునికిఁ బెట్టిన తలలు పది. తదనంతరకాలములందు హనుమద్భక్తి, హనుమదుపాసన, హనుమద్వ్రతము కొన్ని కొన్ని యెడల మన దేశములో సిద్ధికి వచ్చినవి. హనుమంతుని గొప్పతనమును మఱింత గొప్పచేయవలెననుట ఉపాసకులకు భక్తిచేఁగల్గిన ప్రేరేపణ, అది కారణముగా మైరావణచరిత్ర, శతకంఠరావణచరిత్ర, సహస్రకంఠరావణచరిత్ర ఇత్యాది గాథలు కల్పితములు. వీనిలోని సామాన్య విషయము లివ్వి.

“రామలక్ష్మణులు మాయచే స్మృతితప్పి పడియుండ మైరావణాదులు వారిని జెఱపెట్టి తీసికొనిపోయి పాతాళములో దాచి యుంచుట. ఆంజనేయుఁడు పాతాళమునకేగి రావణమిత్రుల సంహరించి రామలక్ష్మణుల బంధవిముక్తులఁ జేసి పిమ్మట యుద్ధరంగమునకుఁ దీసికొని వచ్చుట.” — ఇవి ఆంజనేయుని గొప్పతనమును స్థాపించుటకు, నిరూపించుటకు చేయఁబడిన గాథలు. హనుమమీఁద భక్తి హెచ్చుకొలఁది శ్రీరాముని శత్రువునకు తలలు హెచ్చుట వీనిలోనివిశేషము. ఆంజనేయ భక్తి పారవశ్యముచేత ఇట్టి గోతిచేష్టలు, కల్పనలు కల్గుట సహజమా?

# భాసుఁడు

భాసుఁడు వ్రాసిన నాటకములలో భారత, భాగవత, రామాయణములకు సంబంధించిన పౌరాణికములు తొమ్మిది.

భారత నాటకములు

1. మధ్యమ వ్యాయోగము
2. దూతవాక్యము
3. దూతఘటోత్కచము
4. కర్ణభారము
5. ఊరుభంగము
6. పంచరాత్రము

భాగవత నాటకము

1. బాలచరిత

రామాయణ నాటకములు

1. ప్రతిమ
2. అభిషేకము

# మార్పులు

| నాటకములో | భారతములో |
| --- | --- |
| I దూతవాక్యము | |
| 1. దుర్యోధనుఁడు చక్రవర్తి. | ధృతరాష్ట్రుడు చక్రవర్తి. |
| 2. రాయబారపు సభలో కౌరవులు దక్క అన్యులులేరు. | నారదాది ఋషులు గలరు. |

| నాటకములో | భారతములో |
|---|---|
| 3. దుర్యోధనుఁ డిం దుదాత్తముగాఁ జిత్రింపఁబడినాఁడు. | దుర్యోధనపాత్ర యిందు దుష్టవ్యక్తి. |
| **II కర్ణభారము** | |
| 1. ఇంద్రుఁడు కర్ణు కవచము యాచించుట యుద్ధభూమిలో. | పాండవారణ్యావాస కాలమున. |
| 2. శల్యుఁడు కర్ణునియెడ సానుభూతిగల సారథిగానే చిత్రింపఁబడెను. | శల్యుడు ద్రోహబుద్ధి గలవాఁడు. |
| **III దూతఘటోత్కచము** | |
| ఘటోత్కచుఁడు ధృతరాష్ట్రుని కడకు రాయబారిగా పోవుట కల్పితము. | లేదు. |
| **IV ఊరుభంగము** | |
| 1. దుర్యోధనుని తొడలు విఱుగఁ గొట్టుమని సూచించినది కృష్ణుఁడు. | అర్జునుఁడు. |
| 2. దుర్యోధనుని కొడుకగు దుర్జయుఁడు తొడలు విఱిగి పడియున్న తండ్రియొద్దకు వచ్చుట, తండ్రి కొడుకుల సంవాదము, | ఇందీవిషయములే లేవు. |

| నాటకములో | భారతములో |
| --- | --- |
| అశ్వత్థామ మాటలతోనే దుర్జయుని పట్టాభిషిక్తుని జేయుట యిందుఁ గల్పితములు. | |

**V మధ్యమ వ్యాయోగము**

| | |
| --- | --- |
| ఇందలి కథ యంతయుఁ జమత్కారముగాఁ గల్పింపఁబడిది. | లేదు |

**VI పంచరాత్రము**

గోగ్రహణమను అంశము దప్ప
నితివృత్తమంతయుఁ గల్పితమే.
గోగ్రహణము పాండవులను బయ
లు పఱచుటకు దుర్యోధనుడు
దుర్బుద్ధితో తలపెట్టినట్లు భారత
వృత్తము. నాటకమునం దిది
చాల చిత్రముగా మార్పఁబడినది.

దుర్యోధనుఁడు యజ్ఞమొనర్చు
టయు, యజ్ఞదక్షిణకై తాను
జేసిన అర్ధరాజ్యప్రదాన వాగ్దాన
మునకు సమయముగా గోగ్రహ
ణోద్యమ ముపక్రమింపఁ బడినట్లు
పై నాటకమునఁ జిత్రింపఁబడినది.
ఉత్తరగోగ్రహణమునకుఁ బూర్వ
ము దుర్యోధనుఁడు యజ్ఞము తల

| నాటకములో | భారతములో |
| --- | --- |
| పెట్టుటయు, దాని క్రిందఱు బందుగులతోఁబాటు అభిమన్యుఁడుకూడ వచ్చుటయు, గోగ్రహణమున కెత్తి పోవునపుడు అభిమన్యుఁడును కౌరవులతోఁడఁ గూడి వెడలి తండ్రితో యుద్ధము చేయుటయు మొదలగు రసవంతములైన కల్పనలిందుఁ గలవు. | |
| ఊరు భంగము, పంచరాత్రము నను ఈ రెండు నాటకములలోను దుర్యోధనపాత్ర చిత్రణము నిష్కళంకముగా, ఉదారముగా, సార్వభౌమోచితముగాఁ బోషింపఁబడినది. | |
| రామాయణ నాటకములు | రామాయణము |
| I ప్రతిమ | |
| 1. రామపట్టాభిషేక సమయమున శత్రుఘ్నుఁడయోధ్యయందే యుండును. | భరతునితోఁ బాటు కేకయుల యింటికి వెడలియుండును. |
| 2. భరతుఁడు లక్ష్మణునికంటె చిన్నవాఁడు. | రామునికిఁ దరువాతి వాఁడు; లక్ష్మణునికంటెఁ బెద్దవాఁడు. |

| రామాయణ నాటకములు | రామాయణము |
|---|---|
| 3. సీతాపహరణము జరిగిన పిమ్మట సుమంత్రుఁడు దండకారణ్యమునకు వెళ్లివచ్చినట్లు కలదు. | ఇందామాటయే లేదు. |
| 4. వంశచ్ఛేదకమైన తన యన్యాయమును కుమారుఁడు నిందించునపుడు కైకేయి చెప్పిన సమాధానము: "పదునాల్గు దినములనఁబోయి పొరపాటున పదునాలు గేండ్లంటి" ననుట పాత్ర సంస్కారయుక్తమైన కల్పన. | |
| 5. రావణ సంహారార్థము రామునకు సాహాయ్యముగా భరతుఁడు సేనాసన్నాహ మొనర్చుట కల్పితము. | ఇందు లేదు. |

| భాసుని ప్రకారము | వాల్మీకము రీతి |
|---|---|
| 1. వాలి సముద్రమథన సమయమున తాను సురాసురులకు సహాయము చేసినట్లు చెప్పుట[1] కంబరామాయణమున ఈవిషయమైన వృత్తాంతము భాసుని అను | |

1 శ్లోకము 11

| భాసుని ప్రకారము | వాల్మీకము రీతి |
| --- | --- |
| కరణము. జనసామాన్యమునం దిది ప్రతీతి వహించి యుండవచ్చును. | |
| 2. భారతారణ్యపర్వమునందు వలెనే ఆనవాలుగా ఆంజనేయునికి ఉంగర మొసఁగినట్లు లేదు. | |
| 3. ఇందు సేతుబంధనము లేదు. రామునికి భయపడి సముద్రుఁడు రెండు పాయలై నిలిచి త్రోవ యొసఁగెను. వసుదేవునకు యమున త్రోవ యొసగినట్లు. ఇట్టి గాథయ యూదుల పురాణముల లోను గలదు. అక్కడ ఈసంభావన జరిపినది శోణసముద్రము. | |
| 4. ఇంద్రజిత్తును జంపినది యెవరను మీమాంసకు నిందు నవకాశము గలదు. లక్ష్మణసాహాయ్యుఁడై రాముఁడే చంపినట్లున్నది.[1] మఱి యొకచోట "అని మొనయందు నీకొడుకును (ఇంద్రజిత్తును) జంపి రాముఁడు, లంకను దహించుటకో యన మీఁటి వచ్చుచున్నాఁ"[2] | |

1. V శ్లో॥ 11
2. అందే-శ్లో॥ 16

| భాసుని ప్రకారము | వాల్మీకము రీతి |
| --- | --- |
| డనియు నున్నది. ఇందేమాత్రమైన సత్యమున్న యెడల సీతను జంపి రామునికిఁ దీవ్రదుఃఖ మాపాదింప వలయునను రావణు నుద్దేశము నకు సహజమైన హేతువు కల్గి నట్లు లేర్పడును. | |
| 5. రామునికి పట్టాభిషేకము అయోధ్యలో జరిగినట్లు లేదు. త్వరలో నాటకము ముగించవలె ననియేమో లంకలోనే భాస పట్టాభిషేకము జరిగినట్లున్నది. ఇది ఆభాసమనక తప్పదు. | |
| 6. పట్టాభిషేక సమయమున శత్రుఘ్నుఁడు నయోధ్యలో నుండును.[1] | లేఁడు. |
| 7. అరణ్యవాసము విధింప బడిన విషయము లక్ష్మణుఁడు చెప్పువఱకు రామునకుఁ దెలి యదు.[2] | |
| 8. సీత లక్ష్మణుని తూల నాడినట్లు లేకుండుటకాదు; తూల | |

1. I శ్లో॥ 7
2. అందే శ్లో॥ 23

| భాసుని ప్రకారము | వాల్మీకము రీతి |
| --- | --- |
| నాడ నవకాశమేలేదు. ఏలన రామాజ్ఞమై లక్ష్మణుఁడు ఋషుల సందర్శనార్థము అంతకుముందే తరలిపోయినందున పర్ణశాల యందు లేడు.[1] | |
| 9. కొందఱు మునులు సీతాపహరణమును రామునికిఁ దెలుప నుద్యమింతురు.[2] | |

రాముఁడు వనవాసము సల్పుచుండఁగా నెందఱో ఋషులు గుంపులుగుంపులుగా వచ్చి చూచిపోవుచుండిరిగదా! అయిన సీతాపహారణ సందర్భమున ఒక్క ఋషియేని వచ్చినట్లుగాని, చూచినట్లుగాని, ఏ క్రియనైనను జేయఁబూనినట్లుగాని చెప్పఁబడియుండలేదు. ఆకొఱఁత భాసుని ప్రతిమానాటకమున ఆఱవ యంకారంభమునఁ గల విష్కంభముచేఁ దీఱినది.

తనజాడ రామలక్ష్మణులకుఁ దెలియుటకై నగలన్నిటిని ఊడ్చి అచ్చటచ్చటనో ఒకమూటగనో వేసినట్లు వాల్మీకి. ఇది అనేకగాథలలో, అనేకజనులలో వాడుకలో నుండురీతి, విశ్వసనీయమును.

1. V సీత వాక్యము

2. VI విష్కంభము

సీత ఆంజనేయునకు ప్రత్యభిజ్ఞగా తన శిరోభూషణమునిచ్చినట్లు భాసుని నాటకముల లేకపోవుటకు కారణము ఆయన నగలన్నియు మూటకట్టి క్రిందపాఱవైచుటయు యని నాకు తోఁచుచున్నది.

6. రావణ వధానంతరము    రావణవధ చేసిన వానరు
రాముని కరణ్యమందే పట్టాభి    లతోఁ గూడి తిరిగి వచ్చిన తరు
షేక మైనట్లును బంధుసర్గముం    వాత అయోధ్యయందే పట్టాభి
తయు నచటికే వెడలినట్లును గలదు.    షేకము జరుగును.

రామాయణమునుబట్టి పరమదుష్టురాలుగా కానవచ్చును కైకేయి. ఇచట ప్రమాదపతితయైనదయనీయగా కానవచ్చును. అట్లే సీత లక్ష్మణుని దుర్భాషలాడుట యను కళంకముగూడ నాటకములోఁ దుడిచివేయఁబడినది. ఆమె శీలముగూడ శోభావంతముగాఁ జేయఁబడినది.

## II అభిషేకము

ఇందుమూలకథ విధేయముగా ననుసరింపఁబడినది. కాని, హనుమచ్చేసిన సముద్రలంఘనము జలములు పాయనిచ్చుటచేత కల్పింపఁబడినది. భాసునికాలమున వానరుల సేతునిబంధనగాథ సర్వజన ప్రసిద్ధిగాలేదో లేక సర్వజనసమ్మతము కాకపోయెనో? లంకాదహన స్మారకమైన వాక్యమొక్కటియు లేదు.

భాగవత నాటకము    భాగవతము

(బాలచరిత)

1. శ్రీకృష్ణుడు దేవకీవసు    ఎనిమిదవ సంతానము.
దేవుల ఏడవ సంతానము,

| భాగవత నాటకము | భాగవతము |
|---|---|
| 2. యశోదకు పుట్టిన పిల్ల చనిపోయినట్లును ఆపిల్లను పూడ్చి పెట్టుటకు అడవికి వచ్చిన నంద గోపుని వసుదేవుఁడు కలసికొని బాలకృష్ణు నతని కప్పగించి నట్లును, అంత నాచచ్చిన శిశువు బ్రదుకఁగా వసుదేవుఁడు తీసికొని వచ్చినట్లును కల్పితము. | లేదు. |
| 3. వసుదేవునికి యమునానది పాయలిచ్చుటయు అమూలకము. | |
| 4. కృష్ణుఁడు బాలక్రీడలలో రాధాది గోపికలతో నెఱపిన వినోద శృంగార చేష్ట లిందు స్మరింపఁబడలేదు. | |

పురాణములలో సామాన్యముగా చెడ్డవిగాఁ గన్పట్టు పాత్రములను మంచివిగా చిత్రించుటయు, వస్తువనన్ని వేశమునకు సందర్భశుద్ధి కల్పించుటయు ననునవియే యీమార్పులకుఁ బ్రేరకములవి తోఁచెడిని.

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము 8722/1954